





"ఆఫీసు అందంగా ఉండాలని ఎమల్షన్ పెయింటు వేయిద్దామని పట్టుపట్టాను నేను. కాని, బోలెడు ఖర్చు అవుతుందేమోనని మావాళ్ళు మొదట భయపడ్డారు. సూపర్ డెకోప్లాస్ట్ వేయిస్తే ఖర్చులో 20% పైగా కలిసొస్తుందని నేను నిరూపించినప్పుడు మావాళ్ళకు ఆశ్చర్యంతో నోటంట మాట రాలేదంటే నమ్మండి! నామాటే ఎందుకు, వాడిచూస్తే మీరే నమ్ముతారు. సూపర్ డెకోప్లాస్ట్ వేయిస్తే అందానికి అందం, పొదుపుకి పొదుపు."

సూపర్
డెకోప్లాస్ట్

ఏషియన్ పెయింట్స్

ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు:
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం • 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
|1938 1972|

శుక్రవారం 8 9 '78
కాళయుక్తినామ సం. భాద్రపద ఆ ఏకాదశి
సంపుటము 71 : సంచిక 51

సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

*

దేశంలో విడాది చందా రు 41-60
ఆరు మాసాల చందా రు 20-80
విడిప్రతి వెల 75 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ—520 003

విషయసూచిక













# ఉత్తరాలు

## ఈనాటి వనితాలోకం

4-8-78 నాటి పత్రికలో "స్త్రీపురుషులమధ్య స్నేహం తగునా" అను రచన చాల బాగున్నది నిజానికి నాలాంటిమనసు అంజలిగారికి ఉన్నందుకు నాకు చాల సంతోషం. ఎందుకనగా మా ఊరిలో ఒక వ్యక్తితో చిన్నతనమునుంచి కలిసిమెలిసి వుండేవాళ్ళము. పెద్ద పెరిగాక కూడ అలా వుండటము చూచి లోకులు భరించక, కాకులుగా మాపై ఎన్నో అపనిందలు వేసిరి, మా చిన్ననాటి స్నేహము మా అమ్మకు బాగుగా తెలుసు అయినా లోకులకు భయపడి వెంటనే మా అన్నయ్యవద్దకు పంపించినది. నిజానికి అంజలిగారు వ్రాసినవి చదువుతుంటే నాకు జరిగిన సంఘటన జ్ఞాపకం వస్తున్నది.

నిజానికి అంజలిగారు వ్రాసిన దాంట్లో ఏ మాత్రం అసత్యం కనిపించుటలేదు

కారేటి సుజాత (హైద్రాబాద్)

## కమ్యూనిటీహాలు

మీ 23-6-78వ తేదీ వారపత్రికలో ప్రచురింపబడిన ప్రతి ఇన్ వన్ హాలు గురించి తెలుసుకొనినాము. మేము ఆప్యాయతతో చూస్తున్న స్వామి అయ్యప్ప చిత్రం ప్రదర్శింపబడు థియేటర్ల వద్ద ఏర్పాటు గావింపబడిన హుండీలలో రాబడే మొత్తము (దాదాపు లక్ష రూ॥లు)తో తెనాలి పట్టణములో ప్రతి ఇన్ వన్ హాలు ఒకటి నిర్మించ దలచాము ఇది అన్ని తరాలవారికి ఉపయోగపడే కమ్యూనిటీహాలుగాను. సంవత్సరం అంతటా ఉపయోగపడేహాలుగాను మేము భావిస్తున్నాం.

ఏ. సురేంద్రనాధ్, జనతాపిక్చర్స్.

(విజయవాడ-3)

## సీరియల్

11-8-78 ఆంధ్రసచిత్రవారపత్రిక చూడ ముచ్చటగా వున్నది. మోహనరూప సీరియల్ మంచి పసందుగా వున్నది మాదిరెడ్డి సులోచన గారికి, ప్రచురించిన మీకు మా ధన్యవాదాలు, రాగద్వేషాలు సీరియల్ ప్రారంభంలోనే మా హృదయాలను ఆకర్షించింది విడికథలుపుట్టినరోజు బహుమతి కథ,ఓ నోటు కథ,ఓ ప్రేమకథ మూడు కథలు మాకు ఎంతో బాగానచ్చినవి, మంచి మంచి కథలు ఎన్నుకొని పత్రికను చాల చక్కగా అలంకరించి మాకు అందించి ఆనందింపచేస్తున్న మీకు మా హృదయ పూర్వక అభినందనలు.

పినపాల సరస్వతి, నరసింహారావు(పొన్నూరు)

# మానవుని ఏడవస్థలు — ధర్మపథం — బులుసు వేంకటరమణయ్య

మన పద్ధతి ప్రకారం మానవుల అవస్థలు నాలుగు. అవి బాల్యం, కౌమారం, యౌవనం, వార్ధకం అనేవి. పుట్టినది మొదలు పది, పన్నెండేళ్ళదాకా బాల్యం. తర్వాత యౌవనం వచ్చే వరకూ కౌమారావస్థ. శరీరంలో జవసత్త్వాలు బాగా ఉన్నంత వరకూ యౌవనావస్థ. చివరిది వార్ధకావస్థ.

కాని పాశ్చాత్యుల పద్ధతిలో ఏడవస్థలు ఉన్నట్లు షేక్స్పియరు మహాకవి వ్రాతవల్ల తెలుస్తున్నది. ఆ అవస్థలు ఈ విధంగా ఉంటున్నవి.

తల్లి గర్భంనుండి భూమిపై పడినది తర్వాత పొత్తిళ్లలో పెరిగి, దాది సంరక్షణలో ఉండి, చంక కెక్కి, తర్వాత తప్పటడుగులు పెడుతూ, తొక్కు పలుకులు పలుకుతూ క్రమంగా బడిలో వేసే వయస్సు వచ్చే వరకూ మొదటి అవస్థ. ఆ తర్వాత ఇష్టం లేకుండానే బడికి పోతూ వస్తూ, క్రమంగా చదువుకు అలవాటుపడి విద్య నేర్చుకొన్నది రెండవ అవస్థ. ఈ రెండవస్థలూ మన బాల్య, కౌమారాలకు సమానమైనవి. మూడవది యౌవనావస్థ. ఆ దశలో ప్రణయం ప్రధానంగా ఉంటుంది. నవ యౌవనం మొదలు నిండు యౌవనం వరకూ ఈ అవస్థ. గొప్ప బలం సంపాదించి, ఇతరుల శక్తిని ఓర్వలేక పోటీ పడతూ కయ్యానికి కాలు దువ్వుతూ, యుద్ధానికి సమాయత్తంగా ఉంటూ ఉండేది నాలుగవ అవస్థ. ఈ అవస్థలో తన ప్రియురాలికి లొంగి ఉండడం, మీసాలు మెలిపెట్టడం మొదలైనవి ఉండనే ఉంటాయి. తర్వాతి అవస్థలో బొజ్జ పైకి ఉబుకుతుంది. తెలివితేటలతో నిశితంగా ఆలోచించడం, మంచి అనుభవం, యుక్తాయుక్త విచక్షణ జ్ఞానం స్వాభావికంగా ఉంటాయి.



తర్వాతి ఆరవ అవస్థలో శరీరం చిక్కిపోతుంది. దుస్తులు చాలా వదులయి పోతాయి. చేతి ఉంగరం జారిపోతూ ఉంటుంది. సులోచనాలు జారిపోతూ ఉంటాయి. గొంతుక బొంగురుపోతుంది. వార్ధక లక్షణాలు బాగా కనిపిస్తూ ఉంటాయి.

తర్వాతి ఏడవ అవస్థ చివరిది. తొలి అవస్థ ఈ చివరి అవస్థ సమానమైనవి. శైశవంలో మానవుని స్థితి ఎలా ఉంటుందో, ఇందులోనూ ఆ విధంగానే ఉంటుంది. పండ్లూడిపోవుట, మాటలు స్పష్టంగా లేకుండుట, జ్ఞాపకశక్తి లేకపోవడం, నడవలేకపోవడం ఈ అవస్థకు సాధారణమైన లక్షణాలు. మనవారి యౌవన వార్ధకావస్థలే పాశ్చాత్యుల విభాగంలో అయిదు విభాగాలయినవి.

---

4-8-78 తేదీ నాటి సంచికపైన 'లత' ముఖచిత్రం చాలా ఆకర్షణీయముగా నున్నది. ఈ సంచికలో ప్రారంభమైన "రాగద్వేషాలు" సీరియల్ మనస్సును ఆకట్టుకొన్నది. ప్రారంభములోనే చాలా బాగున్నది కావున రాను రాను ఇంకా రమణీయంగా ఉంటుందని ఆశిస్తున్నాను. శ్రీ. రామలక్ష్మిగారి ప్రశ్నావళి బాగాలాగుంది. పాలాపుని డైరీ కూడా చాలా బాగుంది. కథలలో రెండు కథలు చాలాబాగున్నాయి. జి.వి.జి. పేజీ అందరినీ ఆకర్షించేవిధముగా నున్నది.

ఆ. శ్రీనివాసరావు (మార్టాపేట)

* * *

"మోహనరూప" సీరియల్ మా పత్రికకు (21-7-78) హైలైట్. ధర్మపథం శీర్షిక వలన చాలావిషయములు తెలిసినవి. "ప్రేమించు ముక్తికై" కథ బాగుంది. అన్నిటికీ మించి అందాలతార జయప్రద ముఖచిత్రం పత్రికకు అందం చేకూర్చింది.

వి. శ్రీనివాసరావుశెట్టి, (కర్నూలు)

* * *

తమ నవకల్పనా చాతుర్యంతో "మోహనరూప" సీరియల్‌ను రచించిన రచయిత మాదిరెడ్డి సులోచన గారికి మా సంతోషాభివందనములు. "రాగద్వేషాలు" రెండుభాగాలూ అమితోత్సాహాన్ని అందించింది. ధర్మపథం హితాన్ని ప్రబోధిస్తూ పత్రికకే వన్నె తెస్తున్నది. ప్రచురిస్తున్న పత్రిక వారికి, వారం వారం అందిస్తున్న బులుసు వెంకటరమణయ్య గారికి మా కృతజ్ఞతాభివందనములు.

కె.జి. హేమలత, కె.జి. సరళకుమారి, వి.యం. లత, కండిగట్ల ప్రభాకర్, (కుప్పం.)

## కథలు

28-7-78 నాటి మీ (మా) పత్రికలో ప్రచురించిన "తులసి పుష్పం", "శ్రవ్య నాటిక" లు బాగానే ఉన్నాయి

వి. సాయిప్రసాద్‌గారు రచించిన "ప్రేమించు ముక్తికై" పెద్దకథ 1వ భాగం ఏదో సాఫీగా సాగిపోయింది. 2వ భాగం మాత్రం చాలా ఇంటరెస్టుగా ముందు ముందు ఏం జరుగుతుందో అన్న కుతూహలంగా సాగింది. "ప్రేమా నిన్ను చూసిన ప్రతి క్షణం నాకేమనిపిస్తుందో తెలుసా, నీలాంటిచెల్లెలునాకుంటే ఎంతబావుంటుందని..." అని చదవగానే పత్రిక పక్కనపడేసి మరల అర్ధగంట పోయిన తర్వాత కాని పుస్తకం తీసి కథ పూర్తిచేయలేకపోయాను. ఇటువంటి మంచి కథలు చాలా అరుదుగా కనిపిస్తాయి. రచించిన వి. సాయిప్రసాద్‌గారికి మా హృదయపూర్వక కృతజ్ఞతలు.

టి. శ్రీనివాసు, వి. సోమరాజు (వేమగిరి)

[50వ పేజీ చూడండి]








కలుమూర్తి వెంకటేశ్వరరావు

gopaal

బస్సు... పెళ్ళి బస్సు...

అందమైన రోడ్డుమీద ఆనందాలు నింపుకున్న బంధువులను, స్నేహితులను, సంతోషంతో కేరింతలు కొడుతున్న పిల్లలను తీసుకుని వెళ్ళిపోతుంది పెళ్ళి బస్సు.

కిటికీలోంచి బయటికి చూస్తున్నాడు శేఖర్. ఫ్రెండ్సు వేసే జోకులకు నవ్వుతున్నా రందరూ. అమ్మాయిలు గట్టిగ నవ్వలేక లోలోనే నవ్వుతున్నారు. కిటికీలోంచి చూపు మరల్చి వెనుకకు తిరిగి సుధను చూసాడు శేఖర్. సుధ శేఖరాన్ని చూసి ముఖం త్రిప్పేసింది. నవ్వుకుంటు సర్దుకుని కూర్చున్నాడు.

ఏదో తెలియని ఆనందం... కిన్నెర్ని అనుభూతులు... ఇంకో నాలుగైదు గంటలలో కోరుకున్న శుభ ఘడియ లొస్తాయి. అందాల సుధతో తన వివాహం జరిగిపోతది. సుధ గుర్తుకొచ్చినప్పుడల్లా గత జ్ఞాపకాలు కళ ముందు నిలుస్తాయి. ఆ జ్ఞాపకాలే అతనికి ఊపిరులు.

శేఖర్ నల్లగా వుంటాడు. మరీ అంత నలుపు కాదు... కానీ శేఖర్ కళ్ళు చాలా అందంగా ఉంటాయి. విశాలమైన కను రెప్పలు...కళ్ళల్లో ఆకర్షణ...ఆ ఆకర్షణలో అందం. అతని కళ్ళను చూసి స్నేహితులు ఈర్ష్యకూడా పడుతుంటారు. ఇంట్లో కూడా శేఖర్ కళ్ళనుచూసి అన్నయ్య, అక్క మురిసిపోతుంటారు. కాలేజీలో చదువుకుంటున్నప్పుడు గర్ల్స్ స్టూడెంట్సు శేఖర్ కళ్ళను చూసి "అబ్బ... ఎంత అందమైన కళ్ళు ... నిజంగా మనకుంటే మగాళ్ళు పిచ్చోళ్ళై మన వెనక తిరిగేవారు" అని కామెంట్ చేసేవారు.

అయినా ఏం లాభం... కొంచెం నల్లగా ఉంటాడు. సుధ మల్లె పూవులా వుంటది. సుధ శేఖరాన్ని చూసినప్పుడల్లా మూతిని మూడు వంకరలు త్రిప్పేది. శేఖర్‌తో మాట్లాడాలంటే జంకేది. అయినా చాటుగ కళ్ళను చూసేది... గట్టిగ నవ్వేవాడు శేఖర్... ఛీ... నల్లకోతి అనేది సుధ...

"ఏం... పిల్లా. ఆ నల్లకోతే నీ బావ"

"నల్లని వాడైతేనేం... మీ బావ కళ్ళ ముందు నీ కళ్ళు బలాదూర్ తెలుసా" అని సుధను అందరూ ఉడికించేవారు.

ఆరోజు... శేఖర్ బి. కాం. ఫస్టు క్లాసులో పాసయినప్పుడు ఆ సంతోష వార్తను సుధకు చెప్పడానికి నీటుగా తయారై వెళ్ళాడు. తెల్లని చీర కట్టుకుని కుర్చీలో కూర్చుని ఏదో పుస్తకం చదువుకుంటుంది. శేఖరాన్ని చూసి కుర్చీలోంచి లేవబోయిన సుధను చేతితో వారించుకుని "ఓ మల్లెపూవా... ఈ నల్లని బావ ఫస్టు క్లాసులో ప్యాసయ్యాడు" అని ప్రక్కనే కూర్చున్నాడు.

సుధ గబుక్కున లేచి లోపలకు వెళ్ళిపోయింది. శేఖరంటే సుధ కెంతో ప్రేమ. కానీ ఏవరైనా తన దగ్గర బావ నలుపంటే మండిపడేది.

సుధ లోపలినుండి స్వీట్లు తెచ్చి శేఖరాని కిచ్చింది. సుధ తండ్రి రాఘవరావు శేఖర్‌కి గ్రీటింగ్స్ చెప్పుతూ "ఏం.రా ఏమ్. కామ్. చదువుతావా... లేకపోతే పెళ్ళి చేసుకుని

ఇంటో వుంటావా” అన్నాడు వేటకారంగా.

“ఎమ్. కామ్. చదువుతావు నాయమయ్యా... ఆ తరువాత” అని నిలబడి తననే చూస్తున్న సుధను చూసి కన్ను కొట్టాడు శేఖర్. కంగారు పడిన సుధ, “ఫీ... ఈ వల్లకోతిని నేను చేసుకోను నాన్నా” అంది.

“వాడికేమమ్మా...ఎమ్. కామ్. పాస్సైతే ఆఫీసరవుతాడు. ఇక నలుపంటావా.. వాడి మనసంతా తెలుపేనమ్మా” అని రాఘవరావు బయటికి వెళ్ళి పోయాడు.

“ఏం మల్లెపూవూ ఏమంటావ్”

“బావా... నిన్ను నేను పెళ్ళిచేసుకోను. నీ అందమైన కళ్ళు రెండూ తీసి నా చేతిలో పెట్టినా సరే నేను చేసుకోను” అని ఒక సీటును బలవంతంగా శేఖర్ నోట్లో పెట్టింది.

“ఏయ్... సుధా... ఏదీ... నా కళ్ళలోకి చూసి ఆ మాట అను.”

“నేను చూడనంటే చూడను.”

“సరే సుధా... నన్ను పెళ్ళిచేసుకోవద్దు నా కంటె అందమైన వాడిని పెళ్ళిచేసుకో. నీ సుఖమే నా సుఖం... అప్పుడు నీ పెళ్ళికి నా కళ్ళు తీసి నీకు పెళ్ళి కానుకలుగా ఇస్తాను... నేనంటె అందంగా ఉండను... నా కళ్ళు అందంగా ఉంటాయి కదా...” అని సీరియస్‌గ శేఖర్ అనే మాటలకు చలించి పోయింది సుధ. ఆమె కళ్ళల్లో కన్నీరు నిలిచాయి.

“నో... నో... అలాగనకు బావా” అని వెక్కి వెక్కి ఏడుస్తూ శేఖర్ కౌగిలిలో ఒదిగిపోయింది.

సుధను ఉడికించడం... సుధ తన కళ్ళను దాటుగ చూడడం... శేఖర్ నవ్వడం సుధ కోపంతో మూతిని అష్ట వంకరలు త్రిప్పడం...

అటువంటి సంఘటన లెన్నెన్నో... చిన్నప్పటి నుండి సుధతో కలిసి మెలిసి తిరిగిన ప్రతి రోజు శేఖర్ జీవితంలో మరపు రాని మధుర ఘట్టం.

ఆలోచనలు అలా సాగిపోతున్నాయి.

బస్సులో ఏదో కోలాహలం బయలు దేరింది.

వాస్తవ లోకానికి చేరిన శేఖర్ అందరూ కంగారు పడడం చూశాడు. శేఖర్ గుండెలో రాయి పడింది. డ్రైవరు ముచ్చెమటలతో స్టీరింగు కంట్రోలు తప్పిందని చెప్పాడు. బస్సు స్పీడుగ వెళ్ళిపోతుంది. అందరూ దేముడిపై భారం వేసి మ్రొక్కులు మ్రొక్కుతున్నారు.

డ్రైవరు కంట్రోలు చేయడానికి విపరీతంగా ప్రయత్నిస్తున్నాడు.

శేఖర్ సుధను చూసాడు...

సుధ కళ్ళల్లో కన్నీరు...

అతని కళ్ళముందు కళ్యాణ మండపం కన్నీటిలో కరిగిపోయింది.

అతని మదిలో మ్రోగుతున్న కళ్యాణ గీతం ఆగిపోయింది.

అతని హృదయానికి చేరువవుతున్న సుధ దూరంగా జరిగిపోయింది...

అంతే...

బస్సు ఒక పెద్ద చెట్టును ఢీకొంది.

* * *

పెళ్ళికి బయలుదేరిన బస్సు గమ్యస్థానం చేరకముందే కన్నీటి మడుగులో కూరుకు పోయింది. పూల పాన్పుపై పరవశించ వలసిన శేఖర్...సుధ హాస్పిటల్ బెడ్ పైకి చేరారు.

సుధను ఈలోకాన్ని చూడనీయకుండా చేసింది విధి...

సుధ రెండు కళ్ళూ పోయాయి...

అందరి కళ్ళల్లో కన్నీరు!

శేఖర్‌కు తగిలిన విపరీతమైన గాయాల కన్నా సుధకు జరిగిన అన్యాయం మరింతగ అతనిని క్రుంగదీసింది! ఆలోచనలతో, ఆవేదనతో నీరసిస్తున్న శేఖర్‌ను చూసి అందరూ భయపడుతున్నారు. సుధను చూసి పిచ్చివాడిలా తయారవుతున్నాడు. మందు సరిగ్గా తీసుకోవడం లేదు. డాక్టర్లు చెప్పిన దేది వినిపించుకోవడంలేదు.

ఒకటే కలవరింత...సుధ...సుధ...

నిరాశ, నిస్పృహా నిండిన అతనిమనసులో చిన్న ఆశారేఖ మెదిలింది.

* * *

సుధకు ఆపరేషన్ చేసారు. ఒక వ్యక్తి దానం చేసిన కళ్ళు సుధకు అమర్చారు. ఆపరేషన్ సక్సెస్ అయ్యింది. రోజులు గడుస్తున్నాయి. చీకటి నిండిన తన జీవితానికి వెలుగు రేఖలు చూపించిన ఆ వ్యక్తికి మనసులోనే అంజలి ఘటించింది సుధ.

ఆ రోజు కట్లు విప్పుతారు. ఆనందం పండుగలాడవలసిన ఆ సమయంలో అందరికీ భయంగా ఉంది.

కట్లు విప్పేముందు సుధ అందరినీ పలుకరించింది. బావను రమ్మనమని చెప్పింది. ఎవరూ మాట్లాడలేదు.

“నాన్నా...బావ ఎక్కడున్నాడు?” ఏడుస్తూ అడిగింది.

రాఘవరావు కళ్ళల్లో కన్నీటికి తెంపులేదు. కూతురి తలను నిమురుతూ, “ఆ రోజు బస్సు ప్రమాదంలో బావకు విపరీతమైన దెబ్బలుతగిలాయమ్మా...ఇక్కడ ఏ డాక్టరూ బాగు చేయలేకపోయారు. అందుకేనమ్మా బావను వెంటనే మద్రాసు తీసుకెళ్ళాం. ఇంకా రెండు నెలల వరకు అక్కడికే కదల



కాడదు సీగురించే బాధ పడుతూ వెళ్ళాడు. నీవు తిరిగి ఈ లోకాన్ని చూడాలని కోరు కుంటూ వెళ్ళాడు. పూర్తిగ తగ్గినతరువాత నీ దగ్గరకొస్తానని మరీమరీ చెప్పివెళ్ళాడు.'' అన్నాడు ఓదార్పుతూ...

సుధ వెక్కి వెక్కి ఏడ్చింది.

బావ లేకుండా తనకట్లు విప్పనద్దంటూ మారాం చేసింది. చివరకు ఎలాగైతేనేం సుధకు నచ్చచెప్పి కట్లు విప్పారు.

ఈ లోకాన్ని తిరిగి చూడగల్గింది సుధ

సుధకు కళ్ళొచ్చాయనే ఆనందం అంతగా వివరికీ లేదు ఏ ఒక్కరూ సుధను సూటిగా చూడలేక పోతున్నారు. సుధకంతా అయో మయంగా ఉంది. బావ ... తన శేఖర్‌ను చూడాలనే తపన మరీ బలవంతంకాసాగింది

నెలలు సులభంగా మారుతున్నాయి.

పూర్తిగ కోలుకున్న తర్వాత బావ దగ్గరకు తీసుకెళ్లమని తండ్రిని గట్టిగ అడిగింది. రాఘవరావు సరేనన్నాడు. బావను చూస్తాననే ఆనందంతో ఆమె హృదయం పొంగిపోయింది

అందరూ సుధను చూస్తున్నారు జాలిగ...

"నాన్నా... బావ దగ్గరనుండి ఏమైనా ఉత్తరాలు వచ్చాయా... నాకు చూపు వచ్చిందని... ఈ లోకాన్ని చూస్తున్నానని మీరు బావకు చెప్పారా... నాన్నా నాకంతా బాగానే వుంది. ప్లీజ్... బావ రాసిన ఒక ఉత్తరమైనా నాకు చూపించండి. బావను చూసేలోపల ఉత్తరంలో బావను ఒకసారి చూస్తాను.''

చిన్న పిల్లలా అడుగుతున్న సుధను చూస్తుంటె రాఘవరావు హృదయం జాలితో కరిగిపోయింది.

ఎన్ని రోజుల నుండో దాచిన ఉత్తరాన్ని సుధ చేతి కిచ్చాడు.

సుధ కళ్ళు ఉత్తరంలోవి అక్షరాలతో పోటీ పడ్డాయి.

సుధా,

విధి మనతో ఎంత బాగా ఆడిందో తెలుసా...ఒకటి కావలసిన మనం దూరంగా జరిగిపోయాం. ఆ రోజు బస్సు ప్రమాదంలో నాకు చాలా దెబ్బలు తగిలాయి. కొన్ని రోజుల తరువాత తెలివొచ్చింది. కానీ.. ఎక్కడికి కదలలేని స్థితిలోకి దిగజారి పోయను.

> **విమానంలో వెల్లుల్లి కంపు**
>
> కొంతమందికి వెల్లుల్లి ఇష్టం, కొంతమందికి ఆ వాసనే గిట్టదు. ఏకంగా అనేక డబ్బాల చిక్కటి వెల్లుల్లి నూనె బయటకు కారుతూ ఉంటే ఆ వాసన ఎలా వుంటుంది ? అలాంటి సంఘటన ఈమధ్య ఒక విమానంలో జరిగింది. ఒక స్విస్ ఎయిర్‌లైనర్, కైరోకు డబ్బాల్లో వెల్లుల్లి నూనె తీసుకువెళ్తున్నది! కొంతసేపటికి భరించలేని వాసన వస్తోందని ప్రయాణీకులు ఫిర్యాదు చేశారు. విమానం చికాగో చేరుకోగనే తనిఖీ చేస్తే కొన్ని డబ్బాల్లోంచి వెల్లుల్లి నూనె బయటకు కారుతోందని తేలింది. విమాన సిబ్బంది పది గంటలపాటు ఈ వాసన పోగొట్టడానికి నానా తంటాలు పడ్డారు. కాని ఫలితం ఏమీ లేకపోయింది. చివరికి నిపుణుల్ని పిలిపించారు. వాళ్లుగాస్ మాస్క్‌లు ధరించి, కెమికల్స్ ను ఉపయోగించి మొత్తానికి ఎలాగైతేనేం ఆ వాసన పోగొట్టారు ఇందుకు అయిన ఖర్చు 30,000 ఫ్రాంక్‌లు.

# ఎవరికను లు

నిన్ను చూడాలనుకున్నాను... చూసాను నా సుధ జీవితం చీకటయిందని తెలిసి నేనెంతగానో కుమిలిపోయాను. నాకు తగిలిన దెబ్బలకు నేనంతగ బాధ పడలేదుగానీ నా సుధకు జరిగిన అన్యాయం నన్ను మరింతగా బాధించింది. నీకు ఎవరైనా కళ్ళు దానం చేస్తే చూపు తప్పకుండా వస్తుందని డాక్టర్లు చెప్పారు. నా కెంతో ఆనందం కల్గింది. అయితే ఆ ఆనందం నా కందకుండా పోయింది. శరీరం నిండా గాయాలు. ఎక్కడికీ లేవలేక పోయాను. శారీరకంగా అనుభవిస్తున్న బాధకు మానసిక వ్యధ తోడయ్యింది. నా పరిస్థితి అంతా అయో మయంగా ఉంది నా కళ్ళముందే డాక్టర్లు పెదవి విరిచారు. ఆపరేషనుమీద ఆపరేషను చేసారు. రోజు రోజుకీ నా ఆరోగ్యం క్షీణిం చడం గమనించాను.

సుధా... ఒక రోజు... మంచం మీద పడుకుని శూన్యమైన కళ్ళతో ఏదోలోకాన్ని చూస్తున్న నిన్ను నా దగ్గరకు తీసుకొచ్చారు. లేవలేని స్థితిలో యున్నప్పటికి లేని శక్తిని తెచ్చుకుని నిన్ను కౌగలించుకుని చివరిసారిగా ముద్దు పెట్టుకుని బేలగ వాపోయాను. అందరూ ఎంత వింతగా చూసారో తెలుసా.. అదే చివరి కౌగిలి... అదే ఆఖరి ముద్దు.

రోజు రోజుకి గండంగా మారుతున్న నా పరిస్థితి ప్రాణంపైన ఆశను చంపింది. చివరకు రాలిపోతాననే సమయంలో నేనొక నిర్ణయానికి వచ్చాను.

సుధా... ఆ రోజు జరిగిన సంఘటన గుర్తుందా... "నీ పెళ్ళికి నా రెండుకళ్ళూ తీసి పెళ్ళి కానుకలుగా ఇస్తాను'' అని అన్నాను. ఆ రోజు నేను పలికిన ఆ మాటలే నిజంగా శాపాలుగా మారాయి. నన్ను నీ నుండి దూరం చేసాయి.

సుధా...నేను బతకలేనని తేలిపోయింది. గుండె పగిలేలా ఏడ్చాను. అయితే నేను చనిపోతూ ఈ లోకంలో ముఖ్యంగా నీదగ్గర రెండు విలువైన వస్తువులు వదలి వెళు తున్నాను... ఏవిటో తెలుసా... నా కళ్ళు. నేను చనిపోయేందుకు మూడు రోజు లుందనగనే నా కళ్ళు తీసి నీకు అమర్చమని చెప్పాను... అందరూ బాధ పడ్డారు నాకు మనశ్శాంతి కలిగించేలా ఈ పని చేయమని చెప్పాను... చివరకు ఒప్పుకున్నారు.

ఈ విషయం ముందే నీకు తెలిస్తే నీవు ఒప్పుకోవని తెలుసు. నాగురించి విలపిస్తావు. ఆ సమయంలో నీకేదైనా జరిగితే నేను సహించలేను. అందుకే ఈ విషయం నీకు చెప్పవద్దని అందరికీ చెప్పాను. అన్నీ సవ్యంగా జరిగిన తరువాత... నీవు పూర్తిగా కోలుకున్న తర్వాత... నా గురించి అడిగి నప్పుడు నీకు చెప్పమని చెప్పాను.

సుధా... నిన్ను కడసారిగ చూసాను... నిన్ను చివరి ఘడియలలో పెట్టుకున్న ముద్దు ఏ లోకంలో ఉన్నా నాకు ఆనందాన్ని ఇస్తుంది... ఆ చివరి కౌగిలే జన్మజన్మలకు వీడని బంధ మవుతుంది.

ఈ ఉత్తరం నీవు చదివే సమయానికి నేను ఈ లోకంలోంచి వెళిపోయి ఎన్నో రోజులు కాలగతిలో కలిసిపోయి ఉంటాయి ఈ ఉత్తరం చదువుతూ నీవు ఏడవకు...

ఎందుకో తెలుసా.. నేను నీలోనే ఉన్నాను... నా కళ్ళే నీ కళ్ళు...నా అందమైన కళ్ళు ఇక నీవి...

సుధా... ఈ లోకంలోంచి వెళ్ళిపోయే ముందు నేను నిన్ను ఒక కోరిక కోరుతున్నాను. అదేమిటో చెప్పనా...నీవు పెళ్ళి చేసుకోవాలి...నీవు ఒకింటిదానివి కావాలి... అప్పుడే నాకు మనశ్శాంతి...నా కోరిక తీరుస్తావు కదూ...లేకపోతే నామీద ఒట్టు. నేను ఏ లోకంలో ఉన్నా నీ సుఖాన్నే కోరుతున్నాను.

నీవు మళ్ళీ మామూలు మనిషివై నవ్వుతూ ఆనందంగా జీవితం గడపాలి. నీవు నవ వధువువై నవ జీవితపు రుచులను అందుకోవాలి...నా ప్రియమైన సుధ...నా ముద్దుల సుధ...నా మల్లెపూవు నాకీ మాట ఇస్తావని ఆశిస్తూ నవ్వుతూ ఈ లోకంలోంచి వెళ్ళిపోతున్నాను

నేనెక్కడున్నా నా దీవనలు నీకెపుడూ ఉంటాయి.




నీ పెళ్ళికి నా కానుకలు...కళ్ళు...

ఇట్లు,
నీ శేఖర్.

ఉత్తరం చదువుతున్నంత సేపు ఆమె కళ్ళు వర్షించసాగాయి. గుండె పగిలేలా 'బావా...బావా...' అని చిన్న పిల్లలా ఏడుస్తున్న సుధను ఎవరూ ఓదార్చలేక పోతున్నారు.

కన్నీటి మసకలో బావ ఫోటోను చూసింది ఫోటోలో కూడా మెరుస్తున్న బావ కళ్ళను చూసింది. అద్దంలో తనను తాను చూసుకుంది. తన కళ్ళను తానే నమ్మలేక పోయింది. అవి తన కళ్ళు కావు... అవి బావ కళ్ళు......అందాల కళ్ళు....

# సీరియల్

# రాగద్వేషాలు

## శ్రీమతి మాధవపెద్ది పుణ్యశీలాప్రసాద్

*( గత సంచిక తరువాయి )*

గాలి విసురు ఎక్కువయింది. వర్షం వేగం మిక్కుటమైంది. మళ్ళీ రేడియోలో హెచ్చరిక వినబడింది.

"కోస్తా ఆంధ్ర ప్రజలకు మరో హెచ్చరిక—గాలి వేగం గంటకు వంద కి. మీ వరకూ పెరుగుతోంది. ఉప్పెన వచ్చే సూచనలు కనబడుతున్నాయి! సముద్ర తీరపు ప్రజలు, జాలరులు ఆయా ప్రదేశాలు ఖాళీచేసి పోవల్సిందిగా విజ్ఞప్తి."

ఇది వింటుంటేనే భయం ఎక్కువయి పోతోంది అందరికీ. ఏంచెయ్యాలో తోచడం లేదు. అంతలో పెద్ద ఉరుము శబ్దంతో పాటు మరో పెద్ద శబ్దం వినబడింది.

బయటికి తొంగి చూసింది పార్వతమ్మ. పశువుల కొట్టం పడిపోయింది. గేదెలు రెండు—దూడలు హృదయ విదారకంగా అరవడం అంత వర్షపు శబ్దంలోనూ వినబడుతోంది! పొయ్యినట్లా వదిలేసి కళ్ళనీళ్ళు పెట్టుకుంది పార్వతమ్మ.

వర్షానికి గాలికి ఇల్లంతా వణికిపోతోంది. చాలా పాతది ఆ ఇల్లు. ఆ ఇల్లు వదలడం ఇష్టంలేక అట్లాగే వుంటున్నారు ఆనంద్ తల్లిదండ్రులు.

వంటింటి దూలాలు సైతం కదల సాగాయి. ముందేం జరుగుతుందోనని భయపడ సాగారు అందరూ.

వంటిల్లంతా నీటిమయమై పోతోంది. ప్రతి పావుగంటకి రేడియోలో ప్రకటనలు హెచ్చరికలూ వినబడుతూనే వున్నాయి.

ఆనంద్ అన్నాడు "అందరం మధ్య గదిలో కెళ్దాం పదండి! ఇక్కడొద్దు — వంటిల్లు ఏ క్షణంలోనన్నా కూలచ్చు"

"ఒరేయ్ పశువులనట్లా వదిలేస్తే ఎట్లారా? అవి పోతే...? సగం మన జీవనాధారం అవే" పార్వతమ్మ దిగులుగా అంది.

"ముందు మనం బతుకుతే గదా — జీవనాధారం సంగతి ?"

అందరూ మధ్య రూములోకి వచ్చారు. ఇందిర స్టౌమీదే వంటచేసింది. ఆ గదిలోనే అందరూ ఏదో తిన్నామనిపించారు. ఆనంద్ తల్లిదండ్రులకి బయటికి వెళ్ళి పశువుల్ని రక్షించాలనీ- అవి ఎట్లా వున్నాయో చూడాలనీ అదే పనిగా అనిపిస్తోంది!

కానీ బయట వర్షపు హోరూ. గాలి విసురూ తట్టుకున్నప్పుడు బయటికి వెళ్ళడానికి సాహసించలేక పోతున్నారు.

ఫెళ-ఫెళ మంటూ పెంకులు పడి పోయాయి. ఒక్కొక్క శబ్దం వినవచ్చినప్పుడల్లా అందరికీ ప్రాణాలు పైనే పోతున్నాయి! అరచేతుల్లో ప్రాణాలు పెట్టుకుని చూస్తున్నారు అందరూ గూడా!

వంటింట్లోని సామానంతా నడిమింట్లోకి అతి కష్టంమీద చేర్చారు! ఇంకా కొన్ని మిగిలేపోయాయి! తలుపులూ—కిటికీలూ మూసేశారు! తలో మూలా కూచున్నారు!

అంతలో ఏదో పెద్ద శబ్దం వాన హోరుని దూసుకుంటూ వినవచ్చింది! అదేమిటో చూద్దామని ఆనంద్ పక్కనే వున్న కిటికీ తలుపు తెరవబోయాడు! ఆ మాత్రపు సందులోంచే దూరిన గాలి విసురుకి గదిలోవున్న సామాను చెల్లా చెదరయ్యాయి! పెద్ద పెద్ద బీర్వాలు కూడా కదిలి పడబోయాయి! ఆనంద్ వెనక్కి పడ్డాడు. క్షణంలో అతడి చూపు కిటికీ బయట నిల్చింది-నిశ్చేష్టుడయ్యాడు!

పక్కన కొత్తగా కట్టిన మేడ కూలి పడిపోయింది!

అదే ఆ శబ్దం!

కిటికీని మళ్ళీ మూయడానికి ఎంతో అవస్థపడాల్సి వచ్చింది!

అందరూ గుండెల మీద చేతులుంచుకున్నారు!

మరక్షణంలో వారి వంటిల్లు కూలి పోయింది!

ఆనంద్ తల్లి పెద్దగా ఏడవడం ప్రారంభించింది!

అంతలో వర్షం శబ్దంతో బాటు ఏవేవో

**జరిగిన కథ :** లక్షాధికారి హనుమంతరావుగారు వివాహమాడిన బెంగాలీ యువతి గీత, ఇందిరను కనిన కొంతకాలానికి మరణిస్తుంది. ఆయన అక్క సుగుణ తన కొడుకు ఫారిన్ రిటర్న్‌డ్‌ను ఇందిరకు యిచ్చుటకు ఆమె అత్తమామలు నిరాకరించారని ఉత్తరంలో విచారం వెలిబుచ్చుతుంది. ఇందిరను చేసుకునే విషయములో విశ్వనాథం వ్రాసిన ఉత్తరం హనుమంతరావుని గుండె పోటుకు గురిచేయగా, ఆయన కుమారుడు శ్రీకర్ వ్రాసిన ఉత్తరం ఊరట కల్గిస్తుంది. హనుమంతరావుగారు ఇందిరకి వేరే సంబంధాలు చూస్తుంటారు అమెరికాలోడుద్యోగం చేస్తున్న ఆనంద్‌తో ఇందిరకుఘనంగా వివాహం జరిపిస్తారు రావుగారు. కాపురానికి కావలసిన అన్నివస్తువులూ ఇచ్చి, ఇందిరను అత్తవారింటికి పంపుతారు.

అరుపులు – కేకలు గూడా కలిసి వినిపించ సాగాయి!

కానీ స్పష్టంగా ఏదీ తెలియడం లేదు. అసలు ఆ గదిలో వున్న వారిమాటలే ఒకరివి మరొకరికి వినబడడం లేదు.

తమ గది తలుపు ఎవరో గట్టిగా బాదుతున్నట్టుంది! అంత హోరు శబ్దంలోనూ లీలగా వినిపించిందది! ఇందిర గబగబా వెళ్ళి తలుపు తీయబోయింది! ఆమెని వెనక్కి లాగి – తను తెరిచాడు ఆనంద్ తలుపు!

బిల బిల మంటూ ఒక యాభై మంది జనం ఆడ – మగ – చిన్న – పెద్ద – ముసలీ – ముతకా అందరూ – తడిసి ముద్దయి లోపలికి ప్రవేశించారు!

వాళ్ళందరూ కలిసి మాట్లాడడంతో ఏదీ అర్థం కాకపోయినా – బయటికి దృష్టి సారించిన ఆనంద్ అర్థం చేసుకోగలిగాడు–

మన్నూ – మిన్నూ ఏకమయిందని! గుడిసెలన్నీ ప్రవాహంలో కొట్టుకు పోయాయని. చాలా మంది జనం కూడా ప్రవాహంలో మునిగి కొట్టుకుపోయారనీ – మిగిలిన వారిలో కొందరు తల దాచుకుందామని ఇక్కడికి వచ్చారనీను.

ప్రళయం!

ప్రకృతి విలయతాండవం!

జలం. ఎక్కడ చూసినా జలమే! ఏమిటిది? ఏం జరగబోతోంది? తమిల్లు మొత్తం ఖాళీపోయింది! ఆ ఒక్క గదే ఆధారం– దీనిగతి ఏమవుతుందో? గాలి విసురు తీవ్రతరమైంది. వర్షపు హోరు ఇంకా ఎక్కువయింది. నీళ్ళు లోపలికి రా సాగాయి. చూస్తూండగానే నీటి మట్టం పెరుగుతోంది– కిటికీ లెక్కారు ముందు– బీరువాలపైకి. ఎక్కారు వస్తువులన్నీ నీళ్ళల్లో తేలుతున్నాయి. కటిక చీకటి.

టార్చివేసి కళ్ళు విప్పార్చుకుని చూస్తున్నాడు ఆనంద్. తల్లినీ, తండ్రినీ, ఇందిరనీ అటకమీదికి ఎక్కించాలని.

ప్రతివారికీ ప్రాణభయమే. ఎవరి ప్రాణాలు వారికి తీపి. అప్పటికే చాలా మంది అటకమీదికెక్కి కూచున్నారు.

తల్లినీ, ఇందిరనీ కూడా అటక ఎక్కించాడు ఆనంద్ అతి కష్టంమీద. కిటికీమీద నించే ఎక్కాలి అటక. నిచ్చెన లేదు.

అప్పటికే నీరు ఆనంద్ భుజం వరకూ వచ్చేసింది!

"అమ్మాయ్ ఇందూ నాకు గుండెల్లో నెప్పిగా వుందే" ఆయాసంగా అంది పార్వతమ్మ.

అటక మీద ఇరుక్కు కూచుని వున్నారు వాళ్ళు! ఒళ్ళంతా చెమటలు పట్టేశాయా వేడికి! అత్తగారి భుజం చుట్టూ ఒక చెయ్యివేసి మరోచేత్తో ఆమె గుండెలు









# రాగద్వేషాలు

రామ్మా కూచుంది ఇందిర. ఆ సమయంలో అంతకంటే ఏంచెయ్యాలో తెలియక!

"నాన్నా—నాన్న ఏక్కడ ?" అరిచాడు ఆనంద్ కిటికీ మీద గుండా అటకపైకి వస్తూ!

ఎవ్వరికీ వినబడలేదా కేక!

ఆనంద్ ఇంకా అటక మీదికి రాలేదని ఆందోళనో పక్క ఇందిరకి.

అతణ్ణి చూడంగానే తేలిగ్గా నిట్టూర్చింది.

ఆ జనంతో బాటు తండ్రి గూడా అటక మీదకి ఎక్కేడేమోనని అనుకుంటూ తనూ అటక మీదికి వచ్చేశాడు.

నీళ్లు దాదాపు అటక దాకా వచ్చాయి. ఆ గది చాలా ఎత్తుగా వుంది. అటక గూడా ఎత్తుగానే వుంది. ఇంకా నీళ్ళు పైకివస్తే తమ గతి ఏమిటో? ఇంట్లో ప్రవేశించిన వాళ్ళల్లో చాలామంది నీళల్లో మునిగి పోయారు క్రింద, అటక మీదికి రాలేక! ఆనంద్ అటక మీద టార్చి వేసి చూశాడు తండ్రి కోసం.

తండ్రి లేడు!

పార్వతమ్మ అంతదాకా ఊపిరి బిగపట్టుకుని వుంది.

ఆనంద్ టార్చివెయ్యంగానే "అబ్బాయ్, మీ నాన్న..."అంది నీరసంగా.

ఆనంద్ మాట్లాడలేక పోయాడు. దుఃఖం తన్నుకు వస్తోంది.

"మా...ట్లా...డ.. వేం...రా?" శక్తి నంతా కూడదీసుకుని అరిచినట్టుగా మళ్ళీ అడిగింది.

జవాబులేదు. ఆనంద్ తలవంచుకున్నాడు.

ఆనంద్ మొహం టార్చి వెలుగులో చూసింది పార్వతమ్మ. జరిగింది గ్రహించుకుందామె. ఒక వెర్రికేక వేసిందామె. నొప్పి తీవ్రమైంది. విరుచుకుని ఆనంద్ వడిలో పడిపోయింది.

పడిన వెంటనే ప్రాణం పోయింది.

ఇందిర భయంతో బిగుసుకుపోయింది. నోరెండిపోయిందామెకి. నోట మాట రాలేదు.

తల్లి శవాన్ని పట్టుకుని వెర్రివాడిలాగా వుండిపోయాడు ఆనంద్!!

## 9

రేడియోలో తుఫాను వార్త వింటూనే మతి పోయింది హనుమంతరావు గారికి.

రేపల్లె, బాపట్ల, అవనిగడ్డ తాలూకాలన్నీ కొట్టుకుపోయాయనీ, కృష్ణాజిల్లా బాగా దెబ్బతిందనీ, గుంటూరు జిల్లాలో కూడా చాలా ప్రాంతాలు దెబ్బతిన్నాయనీ, వేలాది జనం చనిపోయారనీ, క్షణం నిలవలేకపోయారాయన!

ప్రాణం విలవిల లాడి పోయిందాయనకి!

ఇందిరెట్లా వుందో. సనే తహతహా అంతకంతకూ ఎక్కువవుతోందాయనకి.

మూడు రోజుల వరకూ ఎంత ప్రయత్నించినా ప్లేన్ టిక్కెట్టు దొరకలేదు.

కమ్యూనికేషన్లు కటాఫ్ ట!

అక్కడ జనం ఎట్లా వున్నారో —

అసలు ఉన్నారో లేదో కూడా తెలీడం లేదు!

త్రిశంకు స్వర్గంలో ఉన్నట్టుగా మూడు రోజులూ గడిపారు. పిచ్చిపట్టినట్టుగా అయిపోయిందాయనకి! తిండీ—నిద్రా లేవు—ఆ మూడు రోజులూను!

మూడు రోజుల తరువాత— అతి ప్రయత్నం మీద ప్లేన్ టికెట్ దొరికింది. గన్నవరంలో దిగి—ఇందిరా వాళ్ళ పల్లెటూరు చేరడానికి చాలా టైము పట్టింది. చాలా కష్టపడాల్సి వచ్చింది.

అప్పటికి నాలుగు రోజులైంది సైక్లోను వచ్చి!

ఊళ్ళన్నీ సముద్రాలైపోయాయి! అన్నీ శవాలే! ఎక్కడ చూసినా మానవ కళేబరాలే! చెట్లన్నీ నేలమట్టమై పోయాయి! కరెంటు స్తంభాలు వంగిపోయాయి! ఊళ్ళల్లో ఎక్కడా కరెంటు లేదు! తాగడానికి నీళ్ళు లేవు! నిలువ నీడలేని వారు ఎందరో! మనసు ద్రవించి పోతోంది చూసే వారికి! పెద్ద పెద్ద ఫ్యాక్టరీలు సైతం పడి పోయాయి!

కూలిన ఇళ్ళకీ కొట్టుకు పోయిన గుడిసెలకీ లెక్కలేదు! వాటికింద పడి మరణించిన జనానికి ఇంకా లెక్క తెలీడంలేదు! కొన్ని ఇళ్ళల్లో మనుషులంతా పోయారు. కొన్ని ఇళ్ళల్లో కొంతమంది పోయారు. తల్లిపోయి బతికిన పిల్లలు. పిల్లలుపోయి బతికిన తల్లులు. తల్లీ-తండ్రీ పోయి అనాథులైన పసిగుడ్లు. ఇంట్లో అంతాపోయి మిగిలిన




కొత్త
National నిప్పో
హైపర్
పెన్‌లైట్ బ్యాటరీలు




నిప్పో శ్రేణిలోని మిగతావాటిలాగే
శక్తివంతంగా పనిచేస్తుంది.
ఇండో నేషనల్ ఉత్పాదన.
సాంకేతిక నైపుణ్యం, జపాన్ దేశపు
నేషనల్ వారిది.

వృత్తినైపుణ్యంగల బ్యాటరీ
నిప్పో హైపర్ పెన్‌లైట్




everest/78/INL/28-tl

ముసలి దగ్గులూ, భర్త పోయి మిగిలిన భార్యా. భార్యా–పిల్లలూ పోయి ఏడుస్తున్న భర్తా.

ఎన్ని కథలో– ఎన్ని గాథలో. ఎన్ని కన్నీళ్ళో– ఎన్ని కష్టాలో ఏడవడానికికూడా శక్తి లేదు. తిండిలేదు కళ్ళల్లో నీళ్ళుకూడా ఇంకిపోయాయి! ఎక్కడ వీటికి అంతు?

ఈ పరిస్థితి రావడానికి ఏం పాపం చేశారీజనం?

విరగ పండింది పంట.. ఈ సంవత్సర మంతా నిశ్చింత అనుకున్నారు రైతులు. కానీ రైతులూ పోయారు మిగిలిన వారికి మట్టికూడా మిగలలేదు పంటంతా కొట్టుకు పోయింది. నేలంతా చవుడయి పోయింది. పట్టిపోయింది. మరికొన్ని సంవత్సరాల పాటు ఏమీ పండదుట ఆ భూమిలో!

వాళ్ళని చూస్తుంటే కడుపు చెరువవు తోంది ఎక్కడచూసినా శ్మశాన వైరాగ్యమే! ఎవరి కంట చూసినా ఎందుకు బ్రతకాలి– అన్న ప్రశ్నే!

నీరు లేకపోతే మనిషి బ్రతకలేడు. కానీ ఆ నీరే మనుషుల ప్రాణాల్ని తీసింది. గాలి లేనిదే మనిషి జీవించలేడు! కానీ ఆ గాలే చాలా జీవుల్ని బలిగొంది! విధి వికటాట్ట హాసం చేసింది!

# రాగద్వేషాలు

రావుగారి మనసులో ఏదో ఆవేదన. ఏదో మంట కడుపులో, ఏదో చెయ్యాలనే తపన– ఆత్రుత! ఏమిటి వీళ్ళకి తను చెయ్యగలిగే సహాయం? అప్పటికప్పుడు పదివేల రూపాయలకి చెక్కు వ్రాసి సహాయనిధికి అందజేశారు.

* * *

ఆనంద్ ఇంటి ముందుకి వస్తూనే శిలాప్రతిమలాగా నిలిచిపోయారు రావుగారు. ఇల్లంతా కూలిపోయి వుంది ఒక్కటేఒక్క గది అదీ కిటికీలు, తలుపులూ అన్నీ విరిగిపోయి వుంది లోపలికేవిధంగ వెళ్ళాలో ఆయనకే తోచలేదు. ఎట్లాగో లోపలికి వెళ్ళిన ఆయన్ని ఇందిర చూసింది శుష్కించి పోయిన ఆమె వదనంలో సంతోషం దుఃఖం పోటీ పడ్డాయి.

"నాన్నా!" వెక్కి వెక్కి ఏడ్చింది తండ్రిని పట్టుకుని.

కూతుర్ని సజీవంగ చూస్తూనే ఆయనకి పోయిన ప్రాణం తిరిగి వచ్చినట్లయింది!

చాలా సంతోషించారు.

కూతురి వళ్ళంతా నిమురుతూ, కన్నీరు తుడుస్తూ వుండిపోయారు చాలా సేపు.

ఆయన కొంత తేరుకుని అల్లుడి కోసం చూశారు. గదంతా సామానతో –తడితో– శవాలతో నిండివుంది!

తల్లి శవం వద్ద ఖిన్నుడై కూచుని వున్నాడు ఆనంద్! ఆరోజే నీళ్ళు కాస ఇంకాయిట ఇంట్లో!

ఇల్లంతా బురద – మట్టి!

తండ్రి శవం ఇంకా కనబడలేదన్నాడు ఆనంద్!

ఆనంద్ పరిస్థితికి ఆయన హృదయం కదిలిపోయింది! చాలా విచారించారు!

తల్లిదండ్రులనిద్దరినీ ఒకేసారి పోగొట్టుకున్న అతడ్ని చూస్తే ఆయనకి అపరిమితమైన బాధా – జాలీ కలిగాయి!

పసిపిల్లవాడిని పొదువుకున్నట్టు అతడిని దగ్గరికి తీసుకుని ఓదార్చారు!

ఆనంద్ బండ బారిన హృదయం ఆ ఓదార్పుతో కరిగి నీరై ప్రవహించింది!

"నాయనా – ఇంక నింపి నేనే నీక్కూడా తండ్రిని! ఇందిర కొక్కదానికే కాదు! విచారించకు – మాటలతో తీరేది కాదు నీ బాధ నాకు తెలుసు! ఇప్పట్నించీ నువ్వు నాకు అల్లుడివి కాదు కొడుకువి!" అన్నారాయన కన్నీరు కారుతుండగా!

ఇందిర జరిగినదంతా వివరించి చెప్పింది!

వింటున్న ఆయన ఆశ్చర్యపోయారు!

కనీ – వినీ ఎరగని గాలివాన!

ఇదే విధంగా వందేళ్ళ క్రిందట వచ్చిందిట!

చాలా సేపు వెతికిన తరువాత దొరికింది ఆనంద్ తండ్రి శవం!

ఆయన తన గదిలోనే వుండిపోయాడు!

ఆ గది కూలి ఆయనపై పడింది. ఆయనా గదిలోకి వెళ్ళడం ఎవరికీ తెలీదు!

ఆ తరువాత నీటితో నిండింది!

తండ్రి శవం చూస్తూనే ఆనంద్ మతి తప్పిన వాడిలాగా అయిపోయాడు!

నీటిలో చీకిపోయివుంది – శవం!

గది కూలడం వల్ల – శరీరం అక్కడక్కడా చితికిపోయి వుంది!

ఆయన శవాన్ని బయటికి లాగడానికి చాలామంది సాయం కావల్సి వచ్చింది!

ఊరంతా నీటి మయమై వుంది. ఎట్లా శవదహనాలు చెయ్యడం?

ఆ తరువాత అయిదారు రోజులకి కానీ






ప్రకృతి రహస్యం కనుగొనబడింది!




# ఇది సహజంగా, మృదువుగా మీ వంటి ఛాయను పెంపొందిస్తుంది

**చర్మానికి నలుపుదనం ఎలా సంక్రమిస్తుంది.**
మీ చర్మం లోపల మెలానిన్ అనే ఒక పదార్థముంది. ఇది ఎంత హెచ్చుగా ఉంటే మనుషులు అంత నల్లగా ఉంటారు. మీరు ఎండలోకి వెళ్ళినపుడల్లా, అల్ట్రావయిలెట్ కిరణాలు మీ చర్మంలో ప్రవేశించి మెలానిన్‌ను మరింత పెంచుతాయి.



**వంటి ఛాయను పెంచడానికి పురాతన పద్ధతి ఏదైనా ఉందా?**
వందలాది సంవత్సరాలుగా, ఆడవారు—సెనగపిండి, పాల మీగడ, నిమ్మరసం, గ్లిసరీన్ ఇంకా ఏవేవో ఉపయోగిస్తూ వస్తున్నారు. వీటి మూలంగా చర్మం మెత్తబడి కాస్త మెరవచ్చు; అంతేగాని చర్మాన్ని నిజంగా ఎర్రగా చేయలేవు. మరొక తెగకు చెందినవి బ్లీచింగ్ పదార్థాలు. ఇవి ఎంత హానికరమైనవో వేరే చెప్పనక్కర్లేదు. అపురూపమైన మీ పట్టుబట్టల్ని మీరు బ్లీచ్ చేస్తారా? మీ చర్మం కూడా పట్టువలె నాజూకు అయినది. పట్టుకంటె అపురూపమైనది.

**విజ్ఞాన విజయం!**
ఫెయిర్ అండ్ లవ్‌లీ సహజంగా మృదువుగా తన పనిచేస్తుంది.



ఫెయిర్ అండ్ లవ్‌లీలో గల ఒక విటమిను, దానిని మీరు రాసుకొన్నపుడు, మీ చర్మంలో ప్రవేశించి, సహజంగా, మృదువుగా, సురక్షితంగా, మెలానిన్ వ్యాప్తిని వెనక్కు నెట్టుతుంది. దాంతో మీ చర్మం చూస్తుండగానే ఎర్రబడుతుంది. అంతేకాక, ఫెయిర్ అండ్ లవ్‌లీ మీ చర్మాన్ని బయటి నుంచి కూడా సంరక్షిస్తుంది. దీనిలోని ఒక పదార్థం ఎండలోని అల్ట్రావయొలెట్ కిరణాలను పడిపోనీ, వాటి మూలంగా మీ చర్మం మరింత నల్లబడకుండా ఆపుతుంది.

**6 వారాలకు మీకే తేడా కనపడుతుంది!**
ఫెయిర్ అండ్ లవ్‌లీని ఆరు వారాల పాటు నియమంగా వాడితే, మీతోపాటు ఇతర్లు కూడా మీ వంటి ఛాయలో మార్పును గుర్తిస్తారు.

ఫెయిర్ అండ్ లవ్‌లీ క్రీమ్ నల్ల చర్మాన్ని ఎర్రబరచడంతో పాటు ఇంకా చేస్తుంది. ఫెయిర్ అండ్ లవ్‌లీ మీ చర్మానికి కోమలత్వాన్ని, సువాసనను చేకూర్చుస్తుంది. రోజుకు కనీసం ఒకసారి వాడండి. రెండుసార్లు వాడితే మరీ మంచిది. నియమంగా వాడితే, మీ వంటి ఛాయ పెంపొందుతుంది, అలాగే ఉంటుంది. సహజంగా, మృదువుగా ఎరుపెక్కుతుంది.



ఫెయిర్ అండ్ లవ్‌లీ—నల్లని చర్మాన్ని ఎర్రబరచడం కోసం మన్నికమైన తీరు.




**ఫెయిర్ అండ్ లవ్‌లీ నల్లని చర్మాన్ని ఎర్ర బరవడం కోసం మన్నికమైన తీరు**

లింటాస్-FALOV.8-2315 Te.

కాస్త నీరు — ఇంకి తెరిపి ఇవ్వలేదు.

రావుగారు అక్కడే వుండిపోయారు. కూతుర్ని — అల్లుణ్ణి వెంటబెట్టుకుని వెళ్ళాలని ఆయన తలంపు!

అప్పటికి ఆనంద్ అక్కలిద్దరూ వచ్చారు. వాళ్ళిద్దరూ దూరంగానే వున్నారు.

ఒకరు మెడ్రాసులోనూ — మరొకరు బెంగుళూరులోనూ వున్నారు.

తుఫాను వచ్చిందని వింటూనే రావాలని ప్రయత్నం చేసినవాళ్ళు ఇప్పటికి రాగలిగారు! తల్లి దండ్రులను చూడాలని ఎంతో ఆతృతగా వచ్చినవాళ్ళు పది రోజులైనా దహన సంస్కారాలెరుగని వాళ్ళ శవాల్ని చూడ గలిగారు వాళ్ళ దుఃఖాన్ని తీర్చడం ఎవరి తరమౌతుంది? ఓదార్చడం ఎవరి వశమౌతుంది? ఊళ్ళే స్మశానాలయినప్పుడు ఎక్కడైతేనేం దహనం చెయ్యడానికి అను కున్నారు.

తల్లిదండ్రుల నిద్దరినీ ఒకేసారి దహనం చేశాడు ఆనంద్ వాళ్ళ శవాలతోబాటు— మిగిలిన శవాలను గూడా దొరికిన మనుషుల సహాయంతో దహనం చేసేశారు రావుగారు— ఆనంద్— ఆనంద్ బావగర్లూ కలిసి. మిగిలిన కర్మ కాండలన్నీ కలకత్తాలో జరిపిస్తానన్నారు రావుగారు.

కూతురు— అల్లుళ్ళతో బాటుగా ఆడ పిల్లల్ని గూడా కొన్నాళ్ళబాటు కలకత్తా రమ్మన్నారు.

"ఇంక ఇక్కడేముంది నాయనా తల్లి దండ్రుల జ్ఞాపకాలు తప్ప. కొన్నాళ్ళు ఈ ప్రదేశానికి దూరంగ వుంటే మంచిది మీక్కూడా. నెమ్మదిమీద ఇల్లు బాగు చేయించుకో వచ్చు. అసలిక్కడ ఇప్పు డుండడం ఆరోగ్యరీత్యా అంత మంచిది కాదు కూడా..." అని ఎంతో నచ్చచెప్పిన మీదట కానీ ఆనంద్ ఒప్పుకోలేదు.

ఆనంద్ అక్కలు వాళ్ళ వూళ్ళు వెళి పోతామన్నారు.

కానీ రావుగారు మెల్లిగా చెప్పారు వాళ్ళకి గూడా ఆనంద్ దగ్గిర కొన్నాళ్ళు వాళ్ళుంటే వాళ్ళకి, ఆనంద్‌కిగూడా కాస్త మనశ్శాంతిగా వుండచ్చుననీ, అదీగాక వాళ్ళ తల్లిదండ్రుల కర్మ కాండలకీ వాళ్ళు వుండాలనీ అన్నారు. చివరికి వాళ్ళూ ఒప్పుకున్నారు. వాళ్ళ భర్తలు మాత్రం వెళిపోయారు. ఆ ఊరి నించి ప్రయాణమయి వెళ్తుంటే ఇందిరకి

# రాగద్వేషాలు

కళ్ళనీళ్ళు జల జల కారసాగయి. ఇల్లూ ఆస్థీ అంతా నేలమట్టమయి పోయింది. ఇంటెడు సామానూ తుఫాను పాలయింది. అత్త మామలు పోయారు! తను పెళ్ళయి మూడు నెలలు కూడా కాలేదు! ఏమిటీ విపరీతాలు? ఎందుకిట్లా జరిగింది? ఆ ఊరిలో మొదట అడుగు పెడుతున్నప్పటి తియ్యటి సంఘటనలు మనసులో మెదిలి తెలియని బాధ కలిగింది. భర్త నైపు చూసింది. ఆనంద్ ఉదాసీనంగా వున్నాడు.

* * *

ఆనంద్ తల్లిదండ్రుల కర్మ కాండలు పెద్ద ఎత్తున జరిపించారు రావుగారు. కలకత్తాలో వున్న పురోహితుల్లో పేరు గాంచిన వాళ్ళని పిలిపించారు

గోదాన — భూదాన — సువర్ణదాన — వస్త్రదాన — అన్నదాన మొదలైన అన్ని దానాలూ ఆనంద్ చేత ఇప్పించారు! అన్నీ శాస్త్రోక్తంగా జరిపించారు!

ఆనంద్ అక్కలు పూర్తిగా సంతృప్తి చెందారు. ఇందిర కూడా చెయ్యవలసిన విధులన్నీ శాస్త్రోక్తంగా నిర్వర్తించింది.

ఆడపిల్లలు వెళ్ళేటప్పుడు యధావిధిగా సత్కరించారు రావుగారు.

వెళ్తూ — తమ్ముణ్ణి కౌగిలించుకుని కంటికి కడివెడుగ ఏడ్చారు — అక్కలు

ఆనంద్ కూడా కన్నీరు నింపుకున్నాడు

ఇందిర చెప్పింది — "చూడండి వదిన గారూ — మీ అమ్మా - నాన్నా లేరని ఎన్నడూ విచారించద్దు ఇదే మీకూ - కూ కూడా పుట్టిల్లు! మీకేది ఎప్పుడు కావాలన్నా నిరభ్యంతరంగా అడగచ్చు ఏడాదికో సారి పసుపు-కుంకుమా అవీ మీరు ఇక్కణ్ణించి కూడా స్వీకరించాలి. మీ తమ్ముడి దగ్గర సరేసరి అనుకోండి —" ఇద్దర్నీ వుద్దేశించి అంది ఇందిర

రావుగారు కూడా అదే అన్నారు — "అమ్మా ఇంకనించీ నాకు ముగ్గురు కూతుళ్ళు అనుకుంటాను. ఏ కష్టం — సుఖం వచ్చినా నన్ను మర్చిపోవద్దు తల్లీ! మీ తమ్ముడు — మరదలు ఫారిన్ వెళ్ళినా, మీరు పుట్టిల్లు లేదని అనుకోవద్దు. ఇదే మీ పుట్టిల్లు! ఇవి నేను మాటవరసకు అంటున్న మాటలు కావు. హృదయం లోంచి వచ్చినవి..." అంటూండగానే ఆయన కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి ఆ ఆత్మీయతకి వాళ్ళు కూడా చలించారు.

'అట్లాగే' నంటూ శలవు తీసుకున్నారు.

( ఇంకా ఉంది )



## ప్రశ్నావళి  —కె. రామలక్ష్మి

సి. ఎస్ పి. సి. ఎస్. జె. — పెదపెంకి

స్త్రీ ఆస్తికి ఆశపడదు, దరిద్రానికి భయపడదు తనకు కావలసినదల్లా భర్త ఆదరణ, అనురాగం. అవి పొందలేనప్పుడు ఆ స్త్రీ స్థితి ఎలా వుంటుంది ?

★ అయ్యో ఆస్తైనా వుంది కాదు, ఐశ్వర్యమేనా వుంది కాదు ! అవే వుంటే యీ భర్తగారు నన్నిలా నిరాదరణ చేయకల్గేవారా అనుకునే స్థితిలో వుంటుంది — నిజానికి కాని మన స్త్రీలు — వాస్తవంగా ఆలోచించరు కద అంచేత తెలుగు సినిమా హీరోయిన్‌లాగా దుఃఖిస్తూ ఆ పంచనా ఆ పంచనా తల దాచుకుని చూసేవాళ్ళని కూడా బాధపెట్టేస్తారు భయపెట్టేస్తారు !

ఆర్. ఆర్. ఆర్. — హైదరాబాదు

నేను ఒక అమ్మాయిని ప్రేమించాను. ఆ అమ్మాయి నన్ను ప్రేమించలేదు. మీ సలహా ?

★ ఇంకో అమ్మాయిని ప్రేమించడానికి వెతుక్కోండి రాజుగారూ, అబ్బాయిల కిలా ప్రేమించడం సరదాయే కద !

పి. ఎ. బి — నిడదవోలు

తుఫాను బాధితులకు మీరేం చేశారన్నదానికి సమాధానం మీరు బాగా యిచ్చారు. నిజంగా మీరు చెప్పినట్లు ఆంధ్రలో మహిళలు ఏ పని చేసినా వారిని హేళన చేస్తారు... దీనికి ఏదైనా మార్గం చెప్పండి.

★ చూడు సోదరీ, గుర్రాన్ని చెరువు దగ్గరకి లాక్కెళ్ళడం సులభమే కాని నీరు తాగడం దానిష్టం కద ! అలాగే యీ సంఘసేవా కార్యక్రమాలు కార్యకర్తలు నానా పాట్లూ పడి మనుష్ని పోగుచేయకలరేగాని — వారిలో మార్పు సహజంగా రావాలి సేవపట్ల నిజమైన ఆసక్తి కలవారు ఏ పని చిన్న పని అనుకోరు వాడేసిన కాగితాలు కవర్లు చేయించి సహాయం చేసేవారూ, బ్యాంకులకు అనువైన చిన్న చిన్న సంచీలు కుట్టించి సహాయం చేసేవాళ్ళూ కూడా నాకు తెలుసు మనం కాస్త ఓపిక పట్టాలేగాని యీ సమాజంలో నిజమైన సేవా కార్యక్రమాలకి సహాయం చేసేవారు చాలామందే వుంటారు "డబ్బు ఎలాగేనా వస్తుంది. కాని పూర్వంలాగా నా బొందో అని పడి పనిచేసే సిబ్బంది లేరిప్పుడు" అన్న దుర్గాబాయిగారి ఆవేదనలో ఎంతో నిజం వుంది ... ముందు సభ్యులను ఒకచోట చేర్చి పథకాలు ఆలోచించండి. ఉత్సాహం తెచ్చుకోండి

పి. వి. సి — తిప్పర్తి

ప్రేమించి పెళ్లి చేసుకోవడంలో స్త్రీలు ఎక్కువగా మోసపోతున్నారు.

★ దాన్నిపట్టే తెలియడంలేదా — ప్రేమ విషయంలో పురుషులలో నిజాయితీ తక్కువ అని !

విజయ, సుజాత, శ్రీదేవి - ఆదోని

తన స్వంత చెల్లెలిని ఎక్కడికైనా తీసుకు వెళ్ళాలంటే చికాకుపడే మగవాడు తన స్నేహితుడి చెల్లెల్ని ఎక్కడికైనా సంతోషంగా తీసుకెళ్లకలడు ఎందుకు ?

★ స్నేహితుడి చెల్లెలు చెల్లెలు కాదుకదా ! అందుకు.

హెచ్. వై. ఆర్ - కాకినాడ

'ఆరనైదోతనము ఏ చోట నుండు, అరుగులు అలికేవారి అరిచేతనుండు' మీ బోధలు బుర్రకెక్కిన యీ కాలపు పడతులు పొద్దున్నే లేచి అరుగులు అలకరు సరికదా మొగుణ్ణి బెడ్‌కాఫీ అడక్కుండా వుంటే గొప్ప.

★ అడిగితేమటుకు తప్పేమిటట ? !

ఎస్ ఎస్. ఆర్. — గుణపూరు

ఎన్ని చదువులు చదివినా, ఉద్యోగాలు చేసినా నదులన్నీ సముద్రంలో కలిసినట్లు — ఆడది మగవానితో జీవితం పంచుకోక తప్పదు కదా మగవాని విలువ గుర్తించక తప్పదుకదా ?

★ విలువ ఎందుకు గుర్తించడంలేదు ? ఏ స్త్రీ అయినా 'తన భర్త' అన్న గర్వంతోనే వుంటుంది. కాని 'నా భార్య' అన్న కాస్త గౌరవం మగవాడు ప్రదర్శించాలని కోరుకుంటుంది. చదువు సంధ్యలూ, ఆదాయం కూడా కల ఆడదానికి వ్యక్తిత్వం గుర్తింపు యివ్వడానికి మగవానికెందుకు చిన్నతనం ? భార్యలు చదువుకోవచ్చు సంపాదించవచ్చు — కాని వాళ్ళ కివ్వవలసిన విలువ యివ్వడం అన్నది అత్యాశ కాదే !

కె వి. ఆర్. — పాలకొల్లు

మీ దగ్గిర ఎంతమంది సెక్రటరీ లుంటారు ?

★ నాదగ్గిర ఒక్కటే 'సెక్రటరీ'వుంది—అదీ యద్దనపూడి సులోచన నవల !

ఎమ్. ఎమ్. — చిర్రావూరు

పాతివ్రత్యం ఆడవారి కొక్కరి కేనా ? మగవారికి కూడదా ? అయితే స్త్రీల విషయంలో అంత పట్టింపు ఎందుకు ?

★ స్త్రీ వంశోద్ధారణ చేస్తుంది — సంతానాన్ని కని — పెంచి. అంచేత స్వార్థపరుడైన పురుషునికి — తన భార్య, తన సంతతి మచ్చలేనిదిగా వుండాలన్న తపన వుండడంలో ఆశ్చర్యం ఏముంది ? కాని ఆడదానికి కూడా తన భర్త శీలసంపద కలవాడుగా వుండాలనే వుంటుంది.

జి. ఆర్. — చిత్తూరు

ఏమండోయ్. ఎమ్ ఎల్. ఏగా పోటీ చేసివుంటే ఓట్లు కాదుకదా డిపాజిట్లు కూడా వచ్చివుండదంటాను.

★ పొగిడేవాళ్ళూ తప్పట్లు కొట్టేవాళ్ళూ — ముంచుతారని తెలియని పిచ్చిదాన్ని కాదు రెడ్డప్పగారరా ! అందుకే నిలబడలేదు.

డి ఎల్ ఆర్ — అుజ

మనిషి చింతకు మందు వుందా ?

★ చింతను చింతనగా మార్చి ముందుకు సాగిపోవడమే మందు

మనిషి కష్టాలు వచ్చినప్పుడు తట్టుకోలేడు ఎందువలన ?

★ ఎవరేనా తీర్చకపోతారా అన్న ఆశతో తట్టుకోలేనట్టు గిలగిల్లాడతాడే తప్పించి మార్గాన్వేషణ చేయలేకకాదు !

ఎస్. ఎస్. — విస్సన్నపేట

రోడ్డుమీద నడచువారు ఎడంపక్కకు పోవాలంటారు కుడిపక్క ఎందుకు పోకూడదు ?

★ ఏ ఎదురుగా వస్తున్న లారీనో కారో గుద్దేస్తుంది కనుక !



సీరియల్

# మోహన రూప

మాదిరెడ్డి సులోచన

"అన్నయ్యా! నన్ను అర్థంచేసుకో డబ్బిచ్చి ఈ బానిసత్వం కొనుక్కోలేను. ఇంత ఎదిగినా నాన్న దిగమంటే పెళ్లి పీటలమీది నుండి దిగటం, కూర్చో అంటే కూర్చునే ఈ మరబొమ్మను నేను చేసుకోలేను" చేతులు జోడించింది. పూర్ణ వణికిపోతుంది

"పూర్ణా!" ఇంద్రమోహన్ చెల్లెలి భుజాలచుట్టు చేయి వేశాడు

"అన్నయ్యా..." అన్నది కన్నీరు ఒత్తుకుంటూ.

"ఇంద్రా! ఇదేం విపరీతంరా! పరువుగలవారెవరూ మన గడప త్రొక్కరు." రామలింగం వణికిపోయాడు.

"వద్దు నాన్నా! పూర్ణ అమాయకురాలు కాదు అది అన్నీ ఊహించే అన్నది. ఈ విషయలు ఎత్తి రోజూ ఆమె జీవితం నరకం చేస్తుంటే రోజు, రోజు మరణించేకంటే, పోషించలేని స్థితి వస్తే ఒక్కసారే ఇంత విషం యిద్దాం" అన్నాడు నిదానంగా.

"ఒహో! పోనీలే అని దయతలిస్తే మాలావు మాటలంటున్నావు. నువ్వే పొమ్మన్నావ్! కట్నం అడ్వాన్స్ అయిదువేలలో ఒక్కపైసా రాదు" పెళ్లికొడుకు తండ్రి హూంకరించాడు

"మాకా సంగతి తెలుసు. వెళ్లి మా పేరు మీదుగా అయిదువేలు పెట్టి పది జతల గాజులు చేయించి వేయండి మీ అబ్బాయికి." చందు అన్నాడు.

"వెళ్లిపొండి! మా అదృష్టం తీసుకు వెళ్లరుగా. మా నాన్న అర్థంలేని దానాలు ఎన్నో చేశాడు. అందులో యిదొకటి" అన్నాడు ఇంద్రమోహన్. బిల, బిలమంటూ అందరూ టూరిస్ట్ బస్ వైపు నడిచారు. సర్దుకోవటానికి తంటాలుపడుతున్నారు. తాతయ్య అప్రతిభుడయినట్టు నిలబడిపోయాడు. అతనికి యింకా మనమరాలి మాటలు నమ్మదగినవిగా అనిపించలేదు.

"ఇంద్రమోహన్‌గారూ! ఈ వివాహం ఆగిపోయిందని విచారించకండి. అంత అనుమానం వున్న మనుష్యులతో అమాయకులు, అంతరాత్మ వున్నవారు కాపురం చెయ్యలేరు" శోభన్ ఓదార్చాడు.

"ఈ ఆశయాలు, ఆలోచనలు బాగానే వున్నాయి బాబూ. ఆచరించేది ఎవరు? ఏ తప్పు జరిగినా ఆడపిల్ల మెడకే ఉరి." రామలింగం బాధగా నుదురు రాచుకున్నాడు.

"నిజమేనండీ! ఇలాంటి యువకులు వేదికలెక్కి నోరు నొప్పిపుట్టేవరకు ఉపన్యాసాలిస్తారు. ఆచరణకు వచ్చేవరకు తప్పుకుంటారు." కవ్వింపుగా అన్నది రూపాదేవి

(గత సంచిక తరువాయి)

"డాక్టరుగారూ!" దెబ్బతిన్నట్టు చూచాడు శోభన్.

"ఏం పొరపాటుగా అనలేదే. ఇప్పుడు ఆ అమ్మాయిని, ఆమె అన్నను అభినందిస్తారు మీకు మాత్రం లక్షల కట్నం కావాలి."

"చాలా బాగా అంచనా వేశారండీ"

"నా అంచనాలు యెప్పుడూ తప్పవు ఇన్ని ఆదర్శాలు వల్లించకపోతే ఆ అమ్మాయికేం లోటు! వివాహం చేసుకోరాదూ! ... ఊహుఁ! అక్కడ మళ్లీ అంతస్తు, ఆస్తి అన్నీ గుర్తుకు వస్తాయి." నవ్వింది హేళనగా

శోభన్ గడ్డం రాసుకుంటూ నిల్చున్నాడు చందూ అక్కను లోపలికి తీసుకు వెళ్లాడు ఇంద్రమోహన్ తల్లి, తండ్రిని ఓదారుస్తున్నాడు

"వెళ్ళొస్తానండీ..." రూపాదేవి దగ్గరగా వెళ్లింది.

"జీవితాంతం మరువలేని మేలు చేశారు. ధన్యవాదాలు." ఇంద్రమోహన్ కళ్ళు చింతనిప్పుల్లా మెరుస్తున్నాయి.

"మీరు వెటకారంగా ధన్యవాదాలు చెప్పినా, మీరు చేసిన మేలుకు హృదయపూర్వకమయిన ధన్యవాదాలు" అని గిరుక్కున తిరిగి తాతగారిని తీసుకుని వెళ్లిపోయింది.

## 22

"అన్నయ్యా! అమ్మా, నాన్న యింత బాధపడతారని తెలిస్తే బలిపశువులా, పీటలమీద కూర్చునేదాన్ని" అన్నది పూర్ణ.

అతను ఎదిగిపోయిన చెల్లెలివంక ఆశ్చర్యంగా చూచాడు.. నీరసంగా నవ్వాడు.

"వారికి మనకు మధ్య ఒకతరం తేడా వుంది పూర్ణా స్యామ్ అందరికి భోజనాలు పెడుతున్నాడు చూచి వస్తాను." ఇంద్రమోహన్ లేచాడు.

"మీరు మన్నిస్తే ఒక మాట చెప్పాలని వచ్చాను ఇంద్రగారూ!" శోభన్ లోపలికి వచ్చాడు అతని మాట తీరులో ఏదో తేడా కనిపెట్టాడు

"ఏమిటి శోభన్!"

"మీ పూర్ణకు నేను నచ్చితే, ఆమెను వివాహం చేసుకుంటాను"

"శోభన్!" ఆశ్చర్యంగా చూచాడు.

"అవును, మీ పూర్ణ దృష్టిలో నేను హనుమంతుడికి అన్నను. అయినా ఆమె అంటే నాకిష్టమే.'

"ఏం పూర్ణా! ..." ఇంద్ర అడిగాడు చెల్లెలిని.

"నాపై ఎవరూ జాలి పడనక్కరలేదు." గోడవైపు ముఖం తిప్పింది పూర్ణ.

"అదేమిటో నువ్వే తేల్చుకో శోభన్. అవతల స్యామ్ ఒక్కడూ అవస్థపడుతున్నాడు. విస్సీ, చక్రం చెక్కేసినట్టున్నారు." ఇంద్రమోహన్ బయటకి వెళ్లాడు

"పూర్ణా! నిజంగా నేను జాలిపడి చేసుకుంటానని అనుకుంటున్నావా? నీవు ఎప్పుడో నచ్చావు. నీ వ్యక్తిత్వం ఈరోజు చూచాను నేను నీకు నచ్చానని తెలుసు..."

"ఎలా తెలుసు!" చురుకుగా చూస్తూ ఇటు తిరిగింది.

"చెప్పనా!" నవ్వాడు

ఆమె తల వంచింది

"నాగార్జునసాగర్‌లో నేను వస్తుంటే, వెడుతుంటే చూచే దొంగచూపులు, అన్న పేరు పెట్టి నాకు కాఫీలు, టీలు అందివ్వటం..."

"చాల్లెండి, గొప్ప రిసర్చి." తనూ నవ్వింది

**జరిగిన కథ-11** స్నేహితులు విశ్వం, ఇంద్రమోహన్, పాషా, స్యామ్సన్, చక్రిలు విహారయాత్ర ముగించుకొని హైదరాబాద్ చేరినపుడు ఇంద్రమోహన్ ఐ. డి. పి. ఎల్‌లో ఇంటర్వ్యూకి వెళ్ళగా; మిగిలిన స్నేహితులు, అక్క సుగుణ, బావంతో కలిసి ఒక సంబంధం చూస్తాడు విశ్వం. ఆమె శ్రీహరి, రుక్మిణిల ఏకైక కుమార్తె డాక్టర్ రూప. ఆమె ఆహ్వానంమీద ధనికుడైన విశ్వం బీదవాడైన ఇంద్రమోహన్‌తో నర్సింగ్‌హోమ్ చూడటానికి సాగర్ వెళ్తాడు కానుకలన్నా కోరలేదన్న కారణంగా తనకు, తన చెల్లెలు పూర్ణకు కుండమార్పిడి సంబంధం విఫలమవడం, ఉద్యోగ ప్రయత్నంలో మోసగింపబడడంవల్ల ఇంద్రమోహన్ నిరాశా నిస్పృహలకు లోనవుతాడు. రూప తండ్రి విదేశాలకు వెళ్ళిన సమయంలో ఇంటి వ్యవహారాలు చూసే ఉద్యోగం చేస్తూ ఆమె నడవడి కనిపెట్టటానికి ఇంద్రమోహన్‌ను పంపుతాడు విశ్వం. రూప దూరపు బంధువైన శోభన్, ఇంద్రమోహన్‌లతో చనువుగా ఉండటాన్ని క్లినిక్ ప్రారంభోత్సవానికి వచ్చిన విశ్వం గమనిస్తాడు దురలవాట్లకు లోనయిన విశ్వం ప్రవర్తనను గురించి రూప, ఇంద్రమోహన్‌ని ప్రశ్నిస్తుంది. ఇంద్రమోహన్‌కు తప్పిపోయిన సంబంధం తాలూకు అమ్మాయి, సావిత్రి, అబార్షన్ చేయించుకొనే నిమిత్తమై రూప నర్సింగ్‌హోమ్‌లో చేరుతుంది. రూప, ఇంద్రమోహన్‌లు మరింత సన్నిహితులవుతారు. తనకు, శోభన్‌కు అక్రమ సంబంధం అంటకట్టాడని విశ్వాన్ని, డైరీ చూచి ఇంద్రమోహన్‌ని, వెళ్లగొడుతుంది రూప. ఉన్న ఇల్లు కూడా అమ్మి రూపకు పెండ్లిపనులు జరుపుతుండే సమయంలో, ఇంద్రమోహన్‌కు బ్యాంకులో ఉద్యోగం వస్తుంది ఇంద్రమోహన్ 'దొంగ' అని తెలిసి పీటలమీది పెండ్లి భగ్నమయ్యే సమయంలో, ఇంద్రమోహన్ డైరీ ఆ సాంతం చదివిన రూప వచ్చి నిజం చెప్పినా పూర్ణ ఆ వివాహానికి అంగీకరించదు.



''అంగీకారమేనా !''

''మీవాళ్ళు అంగీకరిస్తారా !''

''మీవాళ్ల అంగీకరించినా కాదని వరుడిని వాపసు పంపిన నెరజాణవు నువ్వే అనుకోకు. మావాళ్ల కొంత అయిష్టత ప్రకటిస్తారు. అది వేరే విషయం.. '' అన్నాడు.

''కంగ్రాట్స్ మై డియర్ బాయ్! గాడ్ మే బ్లెస్ యు...'' ఆనందంగా వచ్చాడు స్యామ్

అరగంట క్రితం శోకదేవతకు మారుపేరులా వున్న పరిసరాలు ప్రాణం పోసుకున్నట్లు కల, కల లాడాయి. బాజాలు భజంత్రీలు మ్రోగాయి చుట్టుప్రక్కలవారు సంతోషంగా వచ్చారు

ధోవతి లాల్చీ వేసుకుని, పెళ్లికొడుకుగా తయారయిన శోభన్‌ను గౌరవం, ప్రేమ ఉప్పొంగిపోగా కౌగిలించుకున్నాడు ఇంద్రమోహన్.

''ఒరేయ్! ఆ ఛాన్స్ అమ్మాయికి వదిలెయ్యరా...'' స్యామ్ అరిచాడు. అందరూ ..న్నారు.

''నాది బస్సు ఆలస్యంగా రావటం నా అదృష్టంరా. లేకపోతే రోనా, ధోనా హమ్ నహీ జాన్‌తే...'' పాషా వచ్చి, శోభన్ తలకు తురాయి చుట్టాడు.

''బాబూ! ఆత్మీయత అంతా ఒక్కటే! మాకు చెప్పకుండా ఇంద్రుడు పెళ్లి చేసుకున్నా మాకు బాధగానే వుంటుంది. అమ్మా, నాన్నా ఏమంటారో...'' రామలింగం యిబ్బందిగా చూచాడు

''నాగార్జున్‌సాగర్‌లో పూర్ణను, ఇంద్రమోహన్‌గారిని చూచాక, నేనో నిర్ణయానికి వచ్చానండి. మావాళ్లతో ఆ మాటంటే పాతికవేల కట్నం లేనిదే, మాట్లాడవద్దన్నారు. వాళ్లను ప్రసన్నులను చేసుకుని అంగీకరింపజేయాలనుకున్నాను. ఈలోగా పూర్ణ వివాహానికి శుభలేఖ వచ్చింది.''

''ఊఁ ... నీ బాధ అర్థంఅయింది. అందుకే ఈవిధంగా భగవంతుడు అనుగ్రహించాడు పద.. '' స్యామ్ చెయ్యిపట్టి తీసుకు వెళ్లాడు.

''ఇంద్రా! ఆలస్యం అయింది. మంచి ముహూర్తం వుందో లేదో.''

''సంకల్పం కల్గినప్పుడే మంచి ముహూర్తం అంకుల్'' అన్నాడు స్యామ్

''నిజం . మంచివాడ్కి మంచిబుద్ధి కల్గినప్పుడే మంచి సమయ్...''

''ఒరేయ్ పాషా! మంచివాడ్కి యెప్పుడూ మంచిబుద్ధే వుంటుంది. వెళ్లి విస్సిగాడిని, చక్రంను పట్టుకురా '' ఇంద్రమోహన్ ఆదేశించాడు.

అయిదారు గంటల ఆలస్యంగా పూర్ణ, శోభన్‌ల వివాహము వైభవంగా జరిగింది. రామలింగం ఆనందం ఇంతా, అంతా కాదు. వధూవరులు పందిట్లో నుండి లేస్తుండగానే, అతను ఓ టాక్సీ తీసుకువచ్చాడు

# మోహన రూప

"ఏమిటి నాన్నా!" ఇంద్రమోహన్ ఆశ్చర్యంగా చూచాడు.

"మాట్లాడక వెళ్ళి, శోభన్ తల్లి, తండ్రులతో ఆశీర్వాదం పొంది, వాళ్ళందరిని తీసుకుని రండిరా."

"అలాగే నాన్నా" అన్నాడు. చందూ కూడా తయారయ్యాడు. శోభన్ ఇబ్బందిగా చూచాడు.

"మేం వెడతాం. మా నాన్నగారి ఆశీస్సులు మేమే అందుకుంటాం మీరెందుకు ?"

"మీ భావం అర్థం అయింది బావగారూ. తిడితే మీతోపాటు మేం భరిస్తాం..." అన్నాడు చందు, వీరుడిలా. అందరూ ఆనందంగా కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ, శోభన్ వూరు చేరారు. శోభన్ భయపడినట్టే ఆయన తండ్రి అగ్నిహోత్రుడయ్యాడు.

"కని, పెంచి, పెద్దచేసిన వారికంటే, నీకు ప్రేమ, ప్రేమించిన పిల్ల పెద్దగ కనిపించారట్రా! వెళ్ళరా ... వెళ్ళు, నాకు కొడుకే పుట్టలేదనుకుంటాను." ఆయన ధోవతి కొస చేతిలో పట్టుకుని చిందులేస్తున్నాడు.

"నాన్నా! నా మాట విను..."

"వింటాన్రా! యింకా వినవలసినవి చాలా వున్నాయి. చదివేస్తే వున్న మతి పోయిందట..."

"మామయ్యగారూ!" ఇంద్రమోహన్ వెళ్ళి మృదువుగా అర్థించి చేతులు జోడించాడు.

"వివాహమంటే జీవితాంతం కలిసివుండే బంధం. మీరు అనుకున్నంత కాకపోయినా కట్నకానుకలకేం లోటు చేయం. మొదట అమ్మాయిని ఇంట్లోకి రానివ్వండి" అన్నాడు ప్రాధేయ పూర్వకంగా.

అతను ఒకసారి నిశితంగా చూచి లోపలికి దారి వదిలాడు. అంతవరకు వివారంగ నిల్చున్న అతని భార్య వచ్చి అతడిని ఆహ్వానించింది. పూర్ణ చెయ్యిపట్టి లోపలకు తీసుకువెళ్ళింది శోభన్ చందువైపు చూచాడు.

"ఇంతా చేస్తే నేనే పరాయివాడిని అయినట్టున్నాను."

"మా ఇంద్రన్న దగ్గరున్న ఇంద్రజాలమే అది.. మనుష్యుల్ని మచ్చిక చేయటంలో ఫస్టు! మనము వెళ్దాం పదండి." వెనుకాలవాళ్ళు వెళ్ళారు. పూర్ణకి కళ్ళతోనే పాదాభివందనం చేయాలని సూచించింది.

ఇద్దరూ నమస్కరించారు. ముఖం గంటు పెట్టుకునే ఆశీర్వదించారు. ఆమె చాప వేసింది. ఆయన ధోవతి కొస లాల్చీ జేబులో దూర్చాడు.

"చూడయ్యా, నీ పేరు తెలియదు. మేం డబ్బుకు కక్కుర్తి పడే రాక్షసులం కాము. కఠినాత్ములం అంతకంటే కాము. మధ్యతరగతి




కుటుంబీకులం. ప్రతిదానికో ప్రణాళిక వేసుకుంటాం. మెడిసన్ చదివించాలంటే మాటలా! అప్పు, సప్పు చేశాం. ఆ అప్పు తీర్చటం అత్యాశా! సాంఘిక దురాచారమా ?" అన్నాడు శోభన్ తండ్రి.

ఉన్నవారంతా బీదపలుకులు పలుకుతారని తెలుసు. ఇప్పుడేం అన్నా లాభం లేదని ఆయన అన్నదానికల్లా తందాన అన్నాడు.

"ఆశయాలు మంచివేననుకో. ఆచరణ కొచ్చేసరికే చిక్కు. ఈ సంఘం ఉంది చూశావ్! అబ్బాయికేం వంకో అంటారు." ఆయన వాదన కాదనలేదు. తను ప్రత్యక్షంగా అలాంటి నింద మోసుకున్నాడయె.

"మామయ్యా! మా మాట మన్నించి, మా అమ్మాయికి ఆశ్రయం ఇచ్చినందుకు ధన్యవాదాలు. ఈ అయిదువేలుంచుకొండి. వీలునుబట్టి మిగతాది సర్దుతాను" అన్నాడు.

"ఆఁ! ఇవన్నీ ఇప్పటి మాటలు, రెండు మూడు నెలలకు రంగడెవరో, రాకాసి యెవడో!"

"నాన్నా..." శోభన్ ఏదో అనబోయాడు.

"శోభన్! ఈ విషయంలో నువ్వు కలుగజేసుకుంటే నామీద ఒట్టే. మేమిద్దరం వధూవరుల తరపు పెద్దలం" అన్నాడు.

"అబ్బాయి ఇస్తానంటున్నాడుగా తీసుకోండి" అతని భార్య అన్నది.

అతను డబ్బు తీసుకుని దాచాడు. అందరూ పెద్దపూర్ వచ్చారు. వ్రతాలు, విందులు, లాంఛనాలు అయిపోయాయి. వియ్యాలవారిని సకల మర్యాదలతో సాగనంపారు.

"మామయ్యా! పాతిక వేలు కాకపోయినా పదిహేను వేలు త్వరగానే తెస్తాను" బస్టాండులో హామి ఇచ్చాడు ఇంద్రమోహన్.

శోభన్, పూర్ణ ఇక్కడే ఉన్నారు. ఇంద్రమోహన్ డ్యూటీలో జాయిన్ అవటానికి తయారయ్యాడు. కొండంత కష్టము వచ్చినట్టే వచ్చి గోరంతలో తేలిపోయినందుకు సంతోషంగా ఉంది.

"అక్కయ్యా! హనీమూన్‌కు వెడతారుటే!" చందు అడిగాడు.

"ఏరా! నీకు రావాలని ఉందా?" వెక్కిరిస్తూ అడిగింది.

"పెద్ద నీకె పెళ్ళి అయినట్టు! నా పెళ్ళి అయిన్నాడు, నేను వెడతాన్లే..." మూతి ముడిచాడు చందు.

ఇంద్రమోహన్ తల్లికి చెప్పి ఆరు వందలు శోభన్‌కు ఇచ్చాడు. ఆ డబ్బు పూర్ణకు బంధువులు చదివించింది.

"ఊళ్ళు తిరగటానికి ఈ చిన్న మొత్తం సరిపోదు కాని, ఏదో ఒక ఊరు, ఏకాంతంగా గడపటానికి చాలుతుంది. బెంగుళూరో, మైసూరో వెళ్ళిరండి."

"ఈ గదిలో కూర్చుంటే ఏకాంతంగానే ఉంది అన్నయ్యా" అన్నది పూర్ణ తీక్షణంగా. అతను యెంత దాచిపెట్టాలని చూచినా, అతను ఏదో ఇస్తానని అనందే అత్తమామలు అంత సంతోషంగా వెళ్ళరని పూర్ణకు తెలుసు.

"నేను డబ్బు నీకోసం ప్రత్యేకంగా తేలేదమ్మా. ఏదయినా కొనుక్కొమ్మని అందరూ నీకు పెట్టిన డబ్బే" అన్నాడు. ఆ మర్నాడు నూతన దంపతులను హైదరాబాద్ బస్ ఎక్కించి తేలికగా నిట్టూర్చాడు. అన్నీ మన చేతిలో ఉన్నాయి అనుకుంటాడు మానవుడు. కాని అందరికి అతీతమైన శక్తి ఏదో ఉంది, అనుకున్నాడు.

ఇంటికి వచ్చాడు. రామలింగం హాల్లో పచార్లు చేస్తున్నాడు.

"ఇల్లు కొన్నతను వచ్చాడురా, ఇంద్రా! ఈ శ్రావణ మాసంలో గృహప్రవేశానికి మంచి ముహూర్తాలు ఉన్నాయట."

"మనము ఆషాఢ మాసంలోనే ఖాళీ చేస్తామని చెప్పకపోయావా ?" అన్నాడు.

"అంత నిశ్చింతగా అంటావ్! చిన్నాడికింకా సీటు రావాలి."

[32వ పేజీ చూడండి]

# హార్లిక్స్
# మీకు ఎక్కువగా అవసరమయినప్పుడు శక్తినిచ్చే కీలకపోషక పదార్థం.










### గర్భవతిగా ఉన్న కాలంలో

గర్భిణీ స్త్రీకి మంచి సమతూకంలో ఉండి, తేలిగ్గా జీర్ణమయ్యే ఆహారం అవసరం. అందువల్లనే గర్భిణీగా ఉన్నప్పుడు హార్లిక్స్ ఆదర్శప్రాయమయిన ఆహారం. ఇది తల్లికీ, పిల్లకి కూడా శరీర నిర్మాణానికి కావలసిన మాంస కృత్తులు, కార్బొహైడ్రేట్లు సరిఅయిన సమ తూకంలో సమకూరుస్తుంది రాత్రిళ్ళు సేవించిన మలబద్ధకం ఉండదు. ఉదయమే నిస్సత్తువగా ఉండటం పోతుంది.

### అస్వస్థత / అస్వస్థనుంచి కోలుకునే కాలంలో

జబ్బు చేసినప్పుడు మీ శరీరం ఎంతో విలువయిన మాంసకృత్తులు, పోషక పదార్థాలు కోల్పోతుంది దీనివల్ల నిస్సత్తువ ఏర్పడుతుంది. ఈ నష్టాలను భర్తీ చేసేందుకు హార్లిక్స్ తేలిగ్గా జీర్ణమయ్యే రూపంలో శరీర కణాల నిర్మాణానికి కావలసిన మాంస కృత్తులు. శక్తినిచ్చే కార్బొహైడ్రేట్లు ఖనిజాలు సమకూరుస్తుంది దీనివల్ల మీరు త్వరగా కోలుకొంటారు మళ్ళీ జబ్బు పడకుండా తట్టుకునే శక్తి ఏర్పడుతుంది

## ప్రపంచమంతటా డాక్టర్లు సిఫార్సు చేశారు
## హార్లిక్స్ మంచి పుష్టికరమైనది

# దేశ విదేశాలలో గణపతి విగ్రహాలు!



పౌరాణిక యుగంలోనూ, వైదిక యుగంలోనూ గణపతి పేరు వాడుకలో వున్నది. పురాణాలలోని అనేక కథల ప్రకారం గణపతి విఘ్నాల కధిపతి. ఆతడు విఘ్నాలను కలిగించనూ గలడు, వానిని తొలగించనూగలడు. 'గ' అనగా బుద్ధి 'ణ' అనగా విద్య లేక వివేకము 'పతి' అనగా అధిపతి కనుక 'గణపతి' అనగా విద్యాబుద్ధులకు 'అధిపతి' అని అర్థము. త్రిపురాసుర సంహారకాలంలో శివుడతనిని పూజించి విజయము పొందినట్లు తెలియుచున్నది. ఆ సమయంలోనే శివుడీతనిని సకల శుభారంభ వేళల పూజనీయునిగా నిర్ణయించారు. ఆనాటి నుంచి అందరూ ప్రతి కార్యారంభంలోనూ విఘ్నేశ్వరుని ముందు పూజించుట ఆచారమైనది.

శ్రీకృష్ణుడు జాంబవంతుని దగ్గరినుంచి శమంతకమణిని సంపాదించడంకోసం బయలుదేరునపుడు, ఇంద్రుడు వృత్రాసుర సంహారానికి పూనుకున్నప్పుడు, భగీరథుడు గంగను భూమిపైకి తీసుకరావడానికై ప్రయత్నించినపుడు ధర్మజుడు కురుక్షేత్ర భూమిని యుద్ధమునకు సన్నద్ధుడైనపుడు విఘ్నేశ్వరుని ప్రార్థించి తమ కార్యములు నిర్విఘ్నముగా కొనసాగించారట!

వినాయకచవితి అటు ఉత్తర భారతదేశంలోనూ, ఇటు దక్షిణ భారతదేశంలో విధిగా ఆచరింపబడే పండుగ. ముఖ్యంగా తమిళులు ఈ పండుగను అత్యంత ఆశక్తితోనూ, భక్తి ప్రపత్తులతోనూ ఆచరిస్తారు. వారు 'గణపతి'ని పిళ్ళెయార్ అంటారు

## గుంజిళ్లెందుకు?

గణపతి ఏనుగు తలను, ఏకదంతమును, పెద్ద బొజ్జను కలిగియున్నాడు. ఈ దేవుని జన్మ వృత్తాంతాన్ని గురించి అనేక కథలు ప్రచారంలో వున్నాయి. పూర్వం ఏనుగు తల కలిగిన గజాముఖుడను రాక్షసుడు దేవతలందరినీ హింసిస్తూ వుండేవాడు. దేవతలచేత గుంజిళ్లు తీయించుతూ ఆనందించేవాడు. ఈ రాక్షసుడి బాధలు భరించలేక దేవతలందరూ శివుడి దగ్గరికి వెళ్లి మొరపెట్టుకొన్నారు. శివుడు ఏనుగు తల కలిగిన మహావీరుని (గణపతిని) సృష్టించి అతని ద్వారా 'గజాముఖు'డనే రాక్షసుని చంపించాడు. నాటినుండి దేవతలందరూ వినాయకుని ఎడ భక్తిప్రపత్తులు కలిగి ఆతని ముందు 'గుంజిళ్లు' తీయుచుండిరి. ఈ ఆచారము నాటినుంచి కొనసాగి నేడు వినాయకుని గుడి ముందు గుంజిళ్లు తీయడం పరిపాటైపోయింది.

పార్వతీదేవి ఒకనాడు తలంటు స్నానమునకై వెడుతూ ఒక పిండిబొమ్మను చేసి ప్రాణం పోసి యింటి తలవాకిట కావలి వుంచి ఎవ్వరినీ లోనికి రానీయవద్దని చెప్పి వెళ్లింది. ఆ బొమ్మ శివుని గూడా లోనికి రానీయలేదు. శివుడాగ్రహించి శూలముతో ఆతని శిరస్సు తెగవేశారు. విషయము తెలిసిన పార్వతీదేవి ఆ బిడ్డకు ప్రాణము పోయమని శివుని వేడుకొన్నది. ఆయన తన భటుని పంపి వుత్తర దిశగా తల వుంచి నిద్రించుచున్న ఏనుగు తల నొకదానిని నరికించి తెప్పించి, దానిని ఆ బొమ్మ తలగా ఏర్పాటు చేసి ప్రాణం పోశాడు. ఆ బిడ్డడే వినాయకుడని ఒక కథ చెబుతోంది.

## మరో కథ

రజతాద్రిపై పార్వతీ పరమేశ్వరులు విహరిస్తూ వుండగా, ఆ కొండ కిందనున్న సరస్సులో ఏనుగులు కామకేళి జరుపుట వారి కంటబడింది. వారిరువురు కామాశక్తులై ఏనుగు రూపములు ధరించి కోరికను తీర్చుకున్నారు. ఆ సందర్భంలో గౌరి గర్భము ధరింపగా పుట్టిన శిశువే వినాయకుడని తమిళమున గల 'తేవార' గీతములు తెలియజేస్తున్నాయి

## ఏకదంతుడేల?

వినాయకుడు ఏకదంతుడు. మహాభారతమును వ్రాయడానికి వ్యాసమహర్షి వినాయకుని లేఖకుడుగా నియమించుకున్నాడు. గణపతి తన దంతము నొకదానిని వూడబెరికి దానితో భారతమును రచించినాడు. అందువలన నాతడు ఏకదంతుడైనాడు. ఒకసారి పరశురామునితో యుద్ధము చేయునపుడు దంతము విరిగిపోవుటచేత వినాయకుడు ఏకదంతుడైనాడని మరొక కథ వుంది. ఇతడు భోజనప్రియుడైనందువల్ల పెద్ద పొట్ట కలిగి 'లంబోదరుడ'నే పేరు గూడా వుంది.

శిల్పసార శాస్త్ర ప్రకారం '30' రకములైన గణపతి విగ్రహాలున్నాయి. సాధారణముగా గణపతిని 'సమభంగ' (నిలబడియున్న) లేక 'అవిభంగ' (కూర్చొనివున్న) పద్ధతిలో చూపుతారు. ఈతని తొండము మామూలుగా ఎడమప్రక్కకు ఒంగి వుంటుంది. విగ్రహాలు కొన్ని తొండము కుడివైపుగా వున్నట్టుగా చెక్కబడి కూడా వుంటాయి. వీనినే 'వలంబూరి' వినాయకుడంటారు. సామాన్యంగా ఈతనికి రెండు కండ్లు మాత్రమే వున్నా, ఆగమ శాస్త్రాలు మూడు కండ్లు వున్నట్టుగా చెబుతున్నాయి. అదే విధంగా నాలుగు చేతులుండుట సర్వసాధారణమైన విషయము. కానీ కొన్నిచోట్ల పద్నాలుగు చేతులు చూపబడినాయి. ఈతని ప్రతి హస్తములోనూ ఒక ఆయుధముండుట పరిపాటి. అందులో ముఖ్యమైనవి పాశము, అంకుశము, లడ్డుముద్ద మొదలయినవి. ఈతని ఉదరానికి పాము చుట్టుకొని వుంటుంది. ఈతని వాహనము మూషికము.

పైన చెప్పిన 'సమభంగ - అవిభంగ వినాయకులేగాక బాలగణపతి, తరుణగణపతి, మహాగణపతి, భక్తగణపతి, వీరగణపతి, శక్తిగణపతి, ధ్వజగణపతి, సిద్ధిగణపతి, ఉచ్ఛిష్టగణపతి, విఘ్నరాజగణపతి, క్షిప్రగణపతి, హేరంబగణపతి, లక్ష్మీగణపతి విగ్రహాలు కూడా పలుచోట్ల వున్నాయి. వీనిలో శక్తిగణపతి, లక్ష్మీగణపతి విగ్రహాలకు ప్రక్కన దేవి విగ్రహాలు కూడా చెక్కబడి వున్నాయి. ఉచ్ఛిష్టగణపతిదేవిని ఎడమ తొడపై వుంచుకొని బాణము, ధనుస్సు, పాశము, అంకుశము హస్తములలో ధరించి, ఎర్రటి దుస్తులు ధరించియుండును. ఇందులో హేరంబ గణపతి విగ్రహము ఐదు తలలు కలిగి విచిత్రముగా వుండును. ఈవిధంగా శాస్త్రాలు చెప్పిన ముప్పై రకాల గణపతులే కాక శ్రీనాథ కవిసార్వభౌముడు కాశీఖండములో పేర్కొనినట్లు 'ఏబదినారు మూర్తుల నెసక మెసగి' అను మాటనుబట్టి ఏబదినారు మూర్తుల వరకు పెరిగినది.

హిందూదేశంలోనే కాక ఇతర దేశములలోనూ వినాయకుడికి ఆలయములున్నాయి. వానిలో జావా దేశంలోని 'కాపాలిక గణపతి' ఆలయము, నేపాల్‌లోని 'రక్తగణపతి' ఆలయము, టిబెట్టులోని బుద్ధగణపతి ఆలయము, మెక్సికోలోని వినాయకాలయం ముఖ్యమైనవి.

వినాయకుడు ఆజన్మబ్రహ్మచారి. అయినా కొందరు యితనికి 'సిద్ధి – బుద్ధి' అను భార్యలున్నట్టు చెప్పతూవుంటారు. దీనికి కారణము కొన్ని గణపతి విగ్రహముల ప్రక్కన దేవి విగ్రహములు వుండడమేనని చెప్పవచ్చును. ఉదా: లక్ష్మీగణపతి, శక్తిగణపతి. *

పి. కృష్ణమూర్తి

## జి. వి. జి. పేజీ

### మరో సీత కథ

రాజా (మురళీమోహన్) పాట ప్రాక్టీస్ చేసుకుంటూంటే జయ (జయమాలిని) వచ్చి, "రేపు రికార్డింగ్ వుందా? అదేమిటన్నయ్యా! రెండ్రోజుల్లో పెళ్ళి పెట్టుకొని, రేపు కూడా పని చెయ్యాలా?" అంది.

"ఇవ్వాళ మనకి అన్నం పెడుతున్నదీ, ఇంత నీడ యిచ్చిందీ ఈ పనే కదమ్మా? యిది పెళ్ళికంటే ముఖ్యమైంది," అన్నాడు రాజా.

"అన్నయ్యా! మరేం ... మావారిది మహా జాలి గుండె అన్నయ్యా! మైలు దూరంనించి ఏడుపు వినిపిస్తే, ఇక్కడ కన్నీళ్ళు పెట్టుకుంటారు."

"ఇప్పుడేమైందమ్మా?"

"ఏం లేదన్నయ్యా! బాపూజీ జీవకారుణ్య సంఘానికి ఓ పదివేలు ఇవ్వాలని ఆయన కోరిక... అందుకనీ..."

"తప్పకుండా ఇద్దామమ్మా! మనం కూడా ఆ స్థితిలో అర్ధాకలితో అలమటించినవాళ్ళమే కదా? పాపం! వాళ్ళు ఓ రోజైనా తృప్తిగా భోజనం చేస్తారు. ఇస్తానమ్మా. ఉండు," అని రాజా చెక్కు రాసిస్తూ, "చూడమ్మా! నీకు గాని, బావగారికి గాని డబ్బు అవసరమైతే, ఎన్నడుగు. బావగారిని మొహమాటపడొద్దని చెప్పు," అన్నాడు.

ఎన్. గోపాలకృష్ణ, బి ఎస్సి. స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో చిత్తూరు పి. ఎం. షణ్ముగం నిర్మించే పి. ఎం ఎస్. ప్రొడక్షన్ "మరో సీత కథ" చిత్రం మూడువంతులకు పైగా పూర్తయింది. ప్రభ, సంగీత, కె. విజయ, అల్లురామలింగయ్య, మాడా, మిక్కిలినేని, సి. హెచ్. కృష్ణమూర్తి, ప్రభృతులు పాల్గొన్నారు. రచన : జంధ్యాల ఛాయ : ఎస్. ఎస్. వర్మ. సంగీతం. చక్రవర్తి. శిల్పం : కళాధర్. కూర్పు : సత్యం.

### పరారైన పాము

"నాగిన్" హిందీ చిత్రం ఆధారంగా నటి శ్రీప్రియ తమిళంలో సమర్పించే "పియా" చిత్రానికి అరుణాచలం స్టూడియోలో కొన్ని త్రాచుపాములతో చిత్రీకరణ జరుగుతూండగా – హఠాత్తుగా ఒక పాము తప్పించుకొని ఎటో తుర్రుమంది. ఎంతసేపు గాలించినా దొరకలేదు. "ఇక చూసుకోండి – ఆరోజంతా సెట్‌లో అందరూ కాళ్ళు నేలమీదమోపి నడవడానికి భయపడిపోయారు," అంది శ్రీప్రియ నవ్వుతూ. ఈ చిత్రంలో ఆమె కళ్ళకు కాంటాక్ట్ లెన్స్‌లు అమర్చుకొని నటిస్తోంది. వాటి ఖరీదు రెండువేల రూపాయలట.



'మనవూరి పాండవులు'లో శోభ









'అతనికంటె ఘనుడు'లో
కృష్ణ, అల్లురామలింగయ్య




## అతనికంటె ఘనుడు

తన బ్రతుకును మాపేసిన వ్యక్తి ఎక్కడున్నాడో తెలియక, తన పంతం నెరవేర్చుకో లేక — బ్రతకడంకంటే చావడం మేలని కుమిలి పోతున్న సీత (జానకి)తో గోపి (కృష్ణ) "అమ్మా, బాధపడకమ్మా!" అన్నాడు.

"చెప్పింది ఒకటి చేస్తున్నావు గనుకనా? కష్టపడి పని చేసుకోరా అని చెప్పాను. చేశావా? గొడవలు, కొట్లాటలు మానెయ్యనున్నాను విన్నావా? రేపు కట్టుగుడ్డలతో ఇంట్లోంచి బయటికి వెళ్లిపోవలసివస్తుందని తెలిసీ ఏం చెయ్యగలిగావురా?"

"అంత గతి పట్టే ప్రమాదం లేదమ్మా అద్దె విషయం నేను చూసేశాను అంతేకాదమ్మా, నీకు మాటిస్తున్నాను . . ఇకనుంచి ఏ గొడవలకు, దెబ్బలాటలకు వెళ్లను. ఒళ్ళొంచి పని చేస్తాను. నన్ను చూసుకుని నువ్వు గర్వపడేలా చేస్తాను నా మాట నమ్మమ్మా!"

జి. సి. శేఖర్ దర్శకత్వంలో అడుసుమిల్లి లక్ష్మీకుమార్ నిర్మించే "అతనికంటె ఘనుడు" వర్ణ చిత్రంలో జయప్రద నాయిక. సత్యనారాయణ, రావుగోపాలరావు, గిరిబాబు, అల్లురామలింగయ్య, కొంగర జగ్గారావు, చలపతిరావు, జయమోహన్, జయమాలిని ఇతర నటవర్గం సత్యానంద్, చక్రవర్తి, పుష్పాల గోపీకృష్ణ, రాజేంద్రకుమార్ సాంకేతికవర్గం. నిర్వహణ జాస్తి




'కాదు సుమా కథ' లో
కన్నడ మంజుల, మురళీమోహన్

## ప్రేమ చేసిన పెళ్లి

గోడ గడియారం పదకొండు గంటలు కొట్టింది. హాల్లో మేజర్ చంద్రశేఖర్ (గుమ్మడి) అటు ఇటు పచార్లు చేస్తున్నవాడల్లా గోపాలం (మల్లాది)ని ఉద్దేశించి, "ఇంత రాత్రయినా అబ్బాయి ఇంటికి యింకా రాలేదే?" అని అడిగాడు

"తేదీ మారితేగాని ఇంటికి వచ్చే అలవాటు లేదయ్యా! వుంటే — రోజల్లా ఇంట్లోనే తాగుతూ కూర్చోవడం. లేదా, ఏ రెండుకో మూడుకో ఇల్లు చేరుకోవడం మీరెంత సేపని మేలుకుంటారయ్యా? పొద్దుపోయింది పడుకోండి. తెల్లారాక మాట్లాడుకోవచ్చు," అన్నాడు గోపాలం.

"కన్నకొడుకు ఈ స్థితిలో వుంటే, ఏ తండ్రి నిద్రపోగలడు, గోపాలం? పద — వాడెక్కడున్నా వెంటనే వెళ్లి కలుసుకోవాలి."

"ఎక్కడని వెతకగలమయ్యా! ఏ క్లబ్‌లో పేకాడుతూంటారో, ఏ బార్‌లో తాగుతూ వుంటారో!"

బలంగా నిట్టూర్చాడు చంద్రశేఖర్. అతని కొడుకు మూర్తి (చంద్రమోహన్) ఇంట్లో.

విజయనిర్మల స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో నటుడు నాగభూషణం సమర్పించే గౌరీశ్వరీ ఆర్ట్స్ "ప్రేమ చేసిన పెళ్లి" వర్ణ చిత్రానికి సి. గౌరీశ్వరి నిర్మాత.





'తాయారమ్మ — బంగారయ్య'లో మాధవి, జానకి

### శివరంజని

"రఘుదేవపురంలో ఆఖరి షాట్ తీస్తుండగా అమాంతంగా తుఫాన్ ముంచుకొచ్చేసింది. అయినా — షాట్ వస్తే వచ్చింది, లేకపోతే పోయింది — అని షూటింగ్ కొనసాగించాం. ఆ సీన్ ఎంత అద్భుతంగా వచ్చిందో మీరే చూస్తారుగా ?" అన్నారు రచయిత, దర్శక నిర్మాత దాసరి నారాయణరావు మందహాసంతో. ఆయన దర్శకత్వం వహించిన "తూర్పు—పడమర" చిత్రంలో బాగా పాపులర్ అయిన 'శివరంజని' రాగంలోని 'శివరంజని' అనే పల్లవి కర్త సి. నారాయణరెడ్డి, సంగీత దర్శకుడు రమేష్‌నాయుడు ఈ 'శివరంజని' స్కోప్ వర్ణ చిత్రానికి మధురమైన గీతాలను కూర్చడం ఒక విశేషం కాగా — పలువురు ప్రముఖ తారలు, ఫిలిమ్ జర్నలిస్టులు కూడా ఈ చిత్రంలో గెస్టులుగా పాల్గొనడం మరో విశేషం. జయసుధతో పాటు ఆమె సోదరి సుభాషిణి, సుభాషిణి జంటగా హరిప్రసాద్ అనే కొత్త నటుడు, యింకా మోహన్‌బాబు, గోకిన రామారావు, మాడా, కె. వి చలం ప్రభృతులున్నారు. ఛాయ : మణి. కూర్పు · బాలు. శిల్పం . భాస్కరరాజు.

### సీతాపతి సంసారం

బస్సులో 20 పైసల టిక్కెట్టుకు సీతాపతి వందరూపాయల నోటిస్తే, చిల్లర లేదు — దిగిపొమ్మన్నాడు కండక్టరు. సమయానికి జానకి 20 పైసలిచ్చి ఆదుకోకపోతే సీతాపతి కథ మరో మలుపు తిరిగేదే! బస్సు దిగిన తర్వాత హోటల్లో కాఫీ తాగి చిల్లర మార్చి, ఆ అప్పు తీరుస్తానని సీతాపతి అంటే — "ఫర్వాలేదు. ఇరవై పైసలేగా ?" అంది జానకి నిర్లక్ష్యంగా. దానికి సీతాపతి "అమ్మమ్మా! నాకు అప్పడమన్నా — అప్పుండడమన్నా పడదండి. మీకు బాకీపడిపోయా ననుకోండి — రాత్రికి నిద్రపట్టకపోవడం మూలాన రేపు ఆఫీసుకు లేటైపోతాను. లేటవడం మూలాన లెటర్సు స్పీడుగా టైప్ చేసేస్తాను. స్పీడుగా టైప్ చేయడం మూలాన తప్పులు దొర్లుతాయి తప్పులు రావడం మూలాన మేనేజరు నన్ను ఉద్యోగంలోంచి తీసేస్తాడు తీసేయడం మూలాన రోజూ బస్ స్టాప్‌లో అడుక్కుతింటూ బతకాలి. ఒక ట్వెంటీపైసే మూలాన నా లైఫ్ స్పాయిల్ అయిపోయే ప్రమాదముంది. ఇప్పుడు చెప్పండి — నేను ఆదుకోవడం మీ కిష్టమా, అప్పు తీర్చడం మీ కిష్టమా ?" అన్నాడు

చంద్రమోహన్, ప్రభ పాల్గొన్న పై సన్నివేశం చిత్రీకరింపబడ్డ తర్వాత "ఇరవై పైసలకు ఇంత గొడవ జరుగుతుందన్నమాట!" అన్నారు డైరెక్టర్ ఎం. ఎస్. కోటారెడ్డి నావైపు నవ్వుతూ తిరిగి.

రామకృష్ణారెడ్డి సమర్పించే "సీతాపతి సంసారం" చిత్రానికి ఎం సుబ్బరామిరెడ్డి, కె. శంకర్‌రెడ్డి నిర్మాతలు.

'శ్రీరామ పట్టాభిషేకం'లో ఒక దృశ్యం



## జి. వి. జి. పేజీ

### శభాష్ గోపి

ఇంట్లోని వస్తువులన్నిటినీ జప్తు చేస్తూంటే, "అమ్మా! మన సామాన్లన్నీ వాళ్ళెందుకు పట్టుకెళ్తున్నారు?" అనడిగాడు రాము అమాయకంగా.

"నీకు తెలుసుకదరా బాబూ — రాయీ రాయీ పేర్చి, రాత్రనక, పగలనక యెంత కష్టపడి కట్టుకున్నాంరా? ఒరే! మీ నాన్నా నేనూ రెక్కలు ముక్కలు చేసుకుంటూంటే, నువ్వెంత సాయం చేశావో మర్చిపోయావా, నాయనా! అవన్నీ గుర్తుకువస్తున్నాయిరా. ఇంతకాలం కన్నతల్లిగా కాపాడిందిరా ఈ ఇల్లు. ఈ ఇల్లు నే వదిలిపెట్టనురా. నా కట్టె ఇక్కడే కాలిపోవాలిరా!" అని బావురుమంది రాజ్యం.

జి. నిర్మల, బేబీ తులసి, రమణమూర్తి, ఆదుర్తి నరసింహమూర్తి పై సన్నివేశంలో పాల్గొన్న జి. వి ఆర్. పిక్చర్స్ "శభాష్ గోపి" వర్ణ చిత్రంలో మురళీమోహన్, ఈశ్వరరావు, కవిత, పి ఆర్. వరలక్ష్మి, సాక్షి రంగారావు, గెస్టుగా సత్యనారాయణ పాత్రధారులు. చిరంజీవి ఆదుర్తి నరసింహమూర్తి రచయిత. జె. వి. రాఘవులు సంగీత దర్శకుడు. గీతాలను జాన్సన్, వేటూరి, వీటూరి, దేవులపల్లి, దాశరధి రాశారు నిర్మాత: జి. వి. రాఘవయ్యచౌదరి. దర్శకుడు. మానికొండ మధుసూదనరావు.

### ప్రాణం ఖరీదు

జయసుధ బండి వెనకాల నడిచి వచ్చిన బుల్లిఅబ్బాయికి కాళ్ళు పీక్కుపోతుంటే నౌఖరుచేత కాళ్ళు పట్టించుకోసాగాడు. ఇంతలో పెద్దమ్మ వస్తూ "వూళ్ళో పెల్లయితే కుక్కల కడావుడంట," అంది.

"అంటే, నేను కుక్కనా?"

"పౌరుశానికి లోటులేదు ... ఆ ముసిలోడి పెళ్ళాన్ని బండెక్కించి, పాలేరోల్లా బండెనకాల వత్తావా నడిసి? నీ సిగ్గుసివడా! యెటువంటి వొంశం? యెటువంటి పద్దతి! మీ పెద్దయ్య సేయించేవోడు పెల్లిల్లు ఎవ్వడైనా అంగుళం నడిశాడా? గుమ్మంలో బండెక్కి టేసన్ దగ్గిర దిగేవోడు. టేసన్ దగ్గిర బండెక్కి గుమ్మంలో దిగేవోడు. ఆ దర్జాయే యేరు!"

బుల్లబ్బాయిగా నూతన్‌ప్రసాద్, పెద్దమ్మగా ఎన్. డి. లక్ష్మి పాల్గొన్న అన్నపూర్ణా పినీ ఎంటర్‌ప్రైజెస్ "ప్రాణం ఖరీదు" చిత్రంలో రావుగోపాలరావు ద్వితీయ కళత్రం జయసుధ చంద్రమోహన్ హీరో. సత్యనారాయణ ఒక కీలక పాత్రను నిర్వహించారు. సి. ఎస్ రావ్ రచయిత చక్రవర్తి సంగీత దర్శకుడు. లోకనాధ్ ఛాయాగ్రాహకుడు. కె. వాసు దర్శకుడు. క్రాంతికుమార్ నిర్మాత.

## సంక్షిప్త చిత్ర వార్తలు

★ కె. ఎస్ ఆర్. దాస్ దర్శకత్వంలో జి. డి ప్రసాదరావు, శశిభూషణ్ నిర్మించే శ్రీ సారధి స్టూడియోస్ 12వ చిత్రానికి ఆగస్టు 17, 18, 19 తేదీలలో ఆత్రేయ, వేటూరి, దాశరధి రాసిన కొన్ని పాటలు రికార్డు చేయబడ్డాయి సెప్టెంబర్ 9న షూటింగ్ ప్రారంభం. రెండు సినిమాస్కోప్ లెన్సులతో తయారయ్యే ఈ వర్ణ చిత్రంలో కృష్ణ, రజనీకాంత్, చలం, నాగభూషణం, గిరిబాబు, అల్లురామలింగయ్య, లత, జానకి, మాధవి, కవిత, గీత పాల్గొంటారు. రచన మహారధి ఛాయ: ఎస్ ఎస్. లాల్. సంగీతం సత్యం

★ కె. హనుమాన్‌ప్రసాద్ దర్శకత్వంలో కె. సత్యనారాయణ నిర్మించే సత్యం ఎంటర్‌ప్రైసెస్ "కలియుగ మహాభారతం" చిత్రం షూటింగ్ ఆగస్టు 21న హైదరాబాద్‌లో ప్రారంభం. వంకాయల సత్యనారాయణ, ఎం రంగారావు, నూతన్‌ప్రసాద్, హరిబాబు, పి ఎల్. నారాయణ మున్నగువారు పాల్గొంటారు సంభాషణలు: పరుచూరి సంగీతం. సత్యం.

★ కె. సత్యం కూర్పు, దర్శకత్వంలో కె. తాతాజీ నిర్మించే ఉమాదేవి పిక్చర్స్ వారి చిత్రానికి "పట్నం పిల్ల" అని పేరు పెట్టారు.★



'కుమార రాజా'లో ఒక సన్నివేశం

### రావణుడే. రాముడైతే?

మకుటాన్ని ప్రేక్షక జనరంజకంగా పెట్టగల ప్రజ్ఞ ప్రజాదర్శకుడికి, "తాత... మనవడు" దగ్గర్నుంచి తెలుసు. టైటిల్‌తోనే, ప్రేక్షకులలో ఆసక్తిని ఏర్పరచగలరు, శ్రీ దాసరి

శ్రీ అక్కినేని నాగేశ్వరరావు కొత్తతరహా పాత్రను పోషిస్తున్న, లక్ష్మి ఫిలిం కంబైన్స్‌వారి స్కోప్ వర్ణ చిత్రానికి, "రావణుడే రాముడైతే" అనెడి పేరును నిర్ణయించారు, దర్శక. కథకుడు శ్రీ నారాయణరావు

సీతాపహరణం తప్పిస్తే.. రాముడికన్నా రావణుడే గొప్ప అని అందరూ అంగీకరించాలి అలాంటి మచ్చలేని రావణుడి పాత్ర... శ్రీ దాసరి, అక్కినేనిగారికని సృష్టించారు.

### రెండు పాటలు పూర్తి

జులై 31 నుంచి ఆగస్టు 13 వరకు జరిగిన "రావణుడే రాముడైతే" తొలి షెడ్యూలులో

## సినిమా విశేషాలు

అక్కినేని పాల్గొన్న పాటను, అక్కినేని...జయచిత్ర పాల్గొన్న పాటను చిత్రీకరించడంతోబాటు, లత... మురళీమోహన్, మోహన్‌బాబు, మాడా, కె. వి ఎలం, ప్రభాకరరెడ్డిగార్లకు సంబంధించిన సన్నివేశాలను కూడా అగ్రదర్శకుడు చిత్రీకరించారు

శ్రీమతి ఎన్. ఆర్ అనురాధాదేవి నిర్మిస్తున్న ఈ స్కోప్ వర్ణ చిత్రానికి జి. కె. వెంకటేష్ సంగీతాన్ని, కె. ఎస్. మణి ఛాయాగ్రహణాన్ని, వాలి శిల్పాన్ని, బాలు కూర్పును, శాస్త్రి... రాధాకృష్ణ సహదర్శకత్వాన్ని, రాధా ప్రొడక్షన్ను నిర్వహిస్తున్నారు.

సెప్టెంబర్ 20 నుంచి అక్టోబర్ 5 వరకు రెండవ షెడ్యూలు జరుగుతుందని, చిత్ర సమర్పకురాలు శ్రీమతి సి. కృష్ణవేణి తెలిపారు.

### ఎన్టీఆర్ ... చంద్రకళ పాల్గొన్న పాటల చిత్రీకరణ

తిరపతి పిక్చర్స్ శ్రీ ఎన్టీఆర్ ... వాణిశ్రీలతో నిర్మిస్తున్న "సాహసవంతుడు" స్కోప్ వర్ణ చిత్రానికి "లాస్ట్ బట్ వన్" షెడ్యూలు స్థానిక స్టూడియోలలో జరిగింది

శ్రీ ఎన్టీఆర్.. చంద్రకళ పాల్గొన్న యుగళగీతాలు, శ్రీ రామారావుతో తతిమ్మా నటవర్గం పాల్గొన్న ప్రధాన సన్నివేశాలను, దర్శకుడు శ్రీ బాపయ్య చిత్రీకరించారు.

నేపాల్‌లో చిత్రీకరించిన దృశ్యాలు ప్రత్యేక ఆకర్షణగా గల "సాహసవంతుడు" స్కోప్ వర్ణ చిత్రాన్ని, అక్టోబర్ ఆరున విడుదలచెయ్యనున్నట్టు, నిర్మాత శ్రీ విద్యాసాగర్ తెలిపారు. తారకరామ ఫిలింస్ విడుదల.



'తుఫాన్ మెయిల్'లో మంజుల

## రామకృష్ణులుగా అక్కినేని

ప్రజాదర్శకుడు శ్రీ దాసరి నారాయణరావు దర్శకత్వంలో శ్రీ శాండో చిన్నప్పదేవర్ అక్టోబర్ 5 నుంచి ప్రారంభించే "రాముడు కాదు కృష్ణుడు" వర్ణచిత్రంలో రాముడుగా, కృష్ణుడుగా అక్కినేని నటిస్తారు వారికి జంటగా వాణిశ్రీ, జయసుధ నటిస్తారు

'నాలాగ ఎందరో'లో పల్లవి, లక్ష్మీకాంత్



# సినిమా

## అగ్ర నిర్మాత లిద్దరికీ ఒకే కథ

తెలుగు చలన చిత్ర రంగానికి అపూర్వ విజయాన్ని ఆర్జించిపెట్టిన ఓ స్కోప్ చిత్ర నిర్మాత తలపెట్టిన కథ... తెలుగు చలన చిత్ర రంగానికి మకుటం లేని మహారాజుగా వెలుగొందుతున్న ఓ నటుడు తీసే కథ ఒకటే కావడం, యిద్దరు ఒకే కథపై మక్కువ చూపడం, గమనార్హం.

"లక్ష్మమ్మ శ్రీలక్ష్మమ్మ" చిత్రాలు పోటీ పడ్డాయి. ఒకటి నెగ్గింది. మరొకటి వీగిపోయింది. ప్రేక్షకులు ఏ చిత్రాన్ని ఆదరిస్తారో వేచిచూడాలి! పరిశ్రమ పెద్దలు పూనుకుంటే... యీ పోటీ చిత్ర నిర్మాణం జరక్కుండా చెయ్యొచ్చు.

పరిశ్రమ శ్రేయస్సు దృష్ట్యా, యిలాంటి "పోటీ" నివారించడం మంచిది ప్రముఖ సంస్థ... ప్రముఖ నటుడు సామరస్యంగా ప్రవర్తించడానికి "అజాత శత్రువు" లాంటి పెద్దమనిషి పూనుకోవాలి.

## కొమ్మినేనికి కొత్త చిత్రం

"అగ్రదర్శకుడు" శ్రీ దాసరి వెలిగించిన మరో దీపం ... కొమ్మినేని శేషగిరిరావు. "నేను గట్టివాడ్ని," అని తొలి చిత్రం ద్వారా నిరూపించారు, శేషగిరిరావు ఇప్పుడాయన దర్శకత్వంలో ఒక జానపదం ... ఒక సాంఘికం రూపం అందుకున్నాయి.

శ్రీ కొమ్మినేనికి కొత్త చిత్రం వచ్చింది స్కోప్ వర్ణ చిత్రంగా రూపొందనున్న, ఆ చిత్రాన్ని రామచంద్రరావు నిర్మిస్తున్నారు. (హేమ ఆర్ట్ సెలింప్)

"సింగరేణి" గనులను "బ్యాక్ డ్రాప్"గా తీసుకున్నట్టు, దర్శకుడు కొమ్మినేని తెలిపారు "చెయ్యెత్తి జైకొట్టు" అనెడి పేరుతో డిశంబరు నుంచి ప్రారంభమయ్యే చిత్రానికి హీరో కృష్ణ కథానాయకుడు

## సత్యచిత్రకు ముళ్లపూడి

హీరో కృష్ణ త్రిపాత్రాభినయంతో సత్యచిత్ర అధినేతలు శ్రీ సత్యనారాయణ, శ్రీ సూర్యనారాయణ నిర్మిస్తున్న స్కోప్ వర్ణచిత్రం "కుమారరాజా" పూర్తయ్యే ఘట్టంలో పడింది కృష్ణ కథానాయకుడిగా మరో సినిమాస్కోప్ వర్ణచిత్రానికి ఇటీవలె శ్రీకారం చుట్టారు సత్యచిత్ర అధిపతులు ఈ చిత్రం పేరు "లారీ డ్రైవర్". "కుమార రాజా" చిత్రంలో జయప్రద హీరోయిన్. "లారీ డ్రయివర్"లో కూడా ఆమె కథానాయిక "కుమారరాజా" చిత్రానికి పి. సాంబశివరావు దర్శకుడు. "లారీ డ్రయివర్" చిత్రానికి కూడా వారే నిర్దేశకులు.

"కుమార రాజా"కు జంధ్యాల మాటల రచయిత అయితే, "లారీ డ్రయివర్" చిత్రానికి ముళ్లపూడి వెంకటరమణ సంభాషణలకర్త "కుమార రాజా"కు సంగీతాన్ని, కళను, పాటలను, కూర్పును సమకూర్చిన మహదేవన్, కృష్ణారావు, వేటూరి, కె గోపాలరావులే "లారీ డ్రయివర్" చిత్రానికి కూడా పని చేస్తున్నారు.

## ప్రేక్షకులలో హీరోయిన్ల స్థానం ?

ఈమధ్య వారంరోజులు ఆంధ్రదేశంలో వున్నాను. ఎవరిపట్ల ప్రేక్షకాభిమానం ఏ రీతిలో వుందో .. తెలుసుకున్నాను

ఇప్పుడున్న వాతావరణాన్నిబట్టి, ప్రేక్షకుల్లో మన హీరోయిన్ల స్థానం ఇలా వుందని గ్రహించాను. కుమారి వాణిశ్రీ ... కుమారి జయప్రద కుమారి జయసుధ కుమారి జయచిత్ర కుమారి శ్రీప్రియ ... కుమారి లత. అలాగే దర్శకులపై ప్రజాభిప్రాయం ఎలా వుందో తెలుసుకున్నాను శ్రీ దాసరి నారాయణరావు...శ్రీ రాఘవేంద్రరావు .. శ్రీ విశ్వనాథ్ శ్రీ తాతినేని రామారావు శ్రీ బాపు ... శ్రీ వి. మధుసూదనరావు

క్రైం చిత్రాల "రాజా"గా శ్రీ కె. ఎస్ ఆర్ దాసును పేర్కొన్నారు సంగీత దర్శకుల వరుస ఎలా వుందో తెలుసా ?

శ్రీ మహదేవన్, శ్రీ చక్రవర్తి, శ్రీ సత్యం, శ్రీ రమేష్‌నాయుడు దర్శకురాలిగా శ్రీమతి విజయనిర్మలపట్ల ప్రత్యేక అభిమానం వుంది

## రామానాయుడి కొత్త పథకం

హీరోలకు ప్రజలలో ఎంత యిమేజ్ వుందో, నిర్మాత రామానాయుడుగారికి, అంత ప్రతిష్ఠ వుంది సురేష్ చిత్రం వస్తుందంటే.. ప్రేక్షకులలో కలిగే ఉత్సాహం వర్ణనాతీతం

సురేష్ అధినేత తెలుగులో మూడు భారీ వర్ణ చిత్రాలను తలపెట్టారు

ఒకటి శోభన్ . వాణిశ్రీ నటిస్తున్న "ఎంకి . . నాయుడు బావ."

రెండు : శోభన్ . . కృష్ణ పాల్గొనే "రాముడు ... పరశురాముడు "

మూడు డాక్టర్ నాగేశ్వరరావు నటించనున్న స్కోప్ వర్ణ చిత్రం

తెలుగులో అనూహ్య విజయాన్ని సాధించిన "చిలిపికృష్ణుడు" చిత్రాన్ని హిందీలో నిర్మించే నిర్ణయాన్ని శ్రీ రామానాయుడు తీసుకున్నారు ఆయన నిర్మించిన "దిల్ అవుర్ దీవార్" చిత్రం, సెప్టెంబరులో విడుదల కాగలదని తెలిసింది

## గోవాలో దేవర్ చిత్రం

ప్రముఖ నిర్మాత శాండో చిన్నప్పదేవర్ తెలుగులో తొలిసారిగా నిర్మించిన "పొట్టేలు పున్నమ్మ" వర్ణచిత్రం ఆంధ్రదేశంలో విజయఢంకా మ్రోగిస్తున్న విషయం పాఠకవిదితం. ఆ చిత్రంలో మురళీమోహన్, శ్రీప్రియ జంటగా నటించారు అదే జంటతో సెప్టెంబర్ 2 నుండి మరొక వర్ణచిత్రాన్ని నిర్మించడానికి నిర్ణయించారు శ్రీ దేవర్ గోవాలో షూటింగ్ జరిగే ఈ చిత్రంలో కుక్క, గుర్రం ముఖ్య పాత్రల్లో కన్పిస్తాయని, శ్రీ ఆర్ త్యాగరాజన్ దర్శకత్వం వహిస్తారని, శ్రీ దేవర్ చెప్పారు. "పున్నమ్మ"లో నటించిన నటీనటులతోబాటు, పనిచేసిన టెక్నీషియన్లు కూడా ఈ చిత్రానికి పనిచేయడం జరుగుతుందని, ఈ చిత్రం నాల్గు భాషల్లో నిర్మింపబడుతుందని శాండో చిన్నప్పదేవర్ తెలిపారు

— జనప్రియ ★

# పెరుగుతున్న సంవత్సరాలు కాల్షియం-శాండోజ్® సంవత్సరాలు








పాప పుట్టక ముందు నుంచే, పాప యొక్క పళ్ళూ ఎముకలూ రూపొందటం మొదలెడతాయి పసిదనం నుంచీ, పెరిగే వయస్సులో అంతా కూడా కాల్షియం ఎంతో కీలకమైనది

మీ పాపకి గనక, పెరుగుతూన్న ఏ దశలోనైనా సరే, అవసరమైనంత కాల్షియం లభించకపోతే, తరవాత ఎంత యిచ్చినా ప్రయోజనం ఉండదు అందుకే నేడే మీ పాపకు కాల్షియం-శాండోజ్ యివ్వడం మొదలెట్టండి. రోజుకు నాలుగు కాల్షియం-శాండోజ్ బిళ్ళలు గనక యిస్తే, అవి పెరిగే దశలోని ఆ ఏళ్ళలో అత్యావసరమైన కాల్షియంను సమకూర్చి, గట్టిపళ్ళనూ, పటిష్టమైన ఎముకలనూ రూపొందిస్తాయి విటమిన్ సి, డి మరియు బి12తో పటిష్టం చేయబడిన కాల్షియం-శాండోజ్ బిళ్లల్లో, పిల్లలకి యిష్టమయ్యే రుచిగల వెనీలా సువాసన ఉంది

**కాల్షియం-శాండోజ్ స్విట్జర్‌లాండ్‌లోని శాండోజ్ వారు రూపొందించినది. ప్రపంచంలోని అత్యుత్తమమైన కాల్షియం.**

## కాల్షియం-శాండోజ్®

### గట్టిపళ్ళు, పటిష్టమైన ఎముకల కోసం




daCunha/CS/25D TEL/Rev

''అదే వస్తుంది నాన్నా చందూ, ఒరేయ్ తమ్ముడుంగారూ !''

''వస్తున్నాను అన్నయ్యా'' లడ్డు తింటూ వచ్చాడు

''ఏరా ! పూర్ణ పెళ్ళి మొదలు పెట్టిన నాటినుండి నువ్వు అన్నం మానేసి లడ్లే తింటున్నట్టున్నావ్ !''

''మరే ! తినకపోతే అమ్మ ఉంచుతుందా ! అలా వీధిలో వెళ్ళేవారికి పిలిచి పెడుతుంది'' అన్నాడు నిష్కూరంగా.

''అదే చేత్తో అయిపోకముందే నాకో రెండు పెట్టరా నేనింతవరకు రుచి చూడలేదు'' అన్నాడు మరం వేసుకుని ఇంటిముందున్న అరుగు మీద కూర్చుంటూ. తల్లి ప్లేటులో లడ్లతో పాటు, మరిన్ని ఫలహారాలు తెచ్చింది.

''అవునూ, హాస్టల్లోకంటే ఈ ఒక్క సంవత్సరం చక్రం తమ్ములతో గదిలో సర్దుకుంటావా చందూ ?'' లడ్డు తీసుకుని అడిగాడు. చందు ఆలోచనలో పడ్డాడు.

''అది కాదన్నయ్యా, చదువు సాగుతుందా ?''

''మొదటి సంవత్సరం చూడు. సాగదనుకుంటే రెండవ సంవత్సరములో హాస్టల్లో చేరి చదువుకుందువుగాని.''

''అలాగే అన్నయ్యా'' అన్నాడు, చందు. అతను మారాం చెయ్యటానికి ఆస్కారమేలేదు. కొందరు పిల్లలు వేరు కుటుంబం వేరు అన్న రీతులలో ప్రవర్తిస్తారు ఇంద్రమోహన్ తనకు సమయమున్నా అన్నీ తమ్ముడిచేతే వ్రాయిస్తాడు.

''నాన్నా ! నేను డ్యూటీలో జాయిన్ అయ్యాక వారంరోజుల్లో ఇల్లు చూచుకుని ఉత్తరం వ్రాస్తాను. తమ్ముడిని పంపించి మీరు వచ్చెయ్యండి గుండిగలు, తప్పేలాలు, మంచాలు మాత్రం ఎవరింట్లోనైనా సర్దండి'' అని తల్లి, తండ్రికి చెప్పాడు

''అవన్నీ ఎందుకు అమ్మిపారెయ్యక.'' చందూ అన్నాడు.

''మేం పాతబడ్డాంరా, మమ్మల్ని అమ్మిపారెయ్యండి.'' కోపంగా చూచాడు రామలింగం

ఇంద్రమోహన్ తండ్రిని జాలిగా చూచాడు అతను ఇంటిమీద, వస్తువులమీద ఎంత మమకారం పెంచుకున్నాడో తను ఎరగందికాదు మాట మార్చి, మరేదో చెప్పాడు

''ఇంద్రా ! నల్గొండ నుండి ఓ స్నేహితుడు ఉత్తరం వ్రాశాడురా. అమ్మాయి బి. ఇడి. పాసయిందట. కట్న కానుకలు యివ్వలేకపోయినా ఇద్దరు కలిసి సంపాదించవచ్చు...''

''అవును సంపాదించవచ్చు నాన్నా ! ఈకాలం అమ్మాయిలు వివాహం కాగానే మొగుడ్ని కొనేశాం అనుకుంటారు ఆ తరువాత మీ స్థానభ్రంశం, చందుగాడి చదువాగిపోవటం తప్పదు. మరో మూడేళ్ళు ఓపికపట్టు...'' అన్నాడు మధ్యలోనే. అదీ నిజమే అనిపించింది

''నిజమేరా ! నీ ఆలోచనే బావుంది'' అన్నాడు. ముందున్న ఫలహారంమీద దండయాత్ర సాగించాడు ఇంద్రమోహన్.

# మోహనరూప

[22వ పేజీ తరువాయి]

## 23

డామ్ క్రిందివైపు గుడి దాటుకుని వెళ్ళి, నీళ్ళు పడే దగ్గర నిల్చున్నాడు. మీద చదునుగా వున్న చోట ఏదో షూటింగ్ జరుగుతున్నట్టుంది జనం విరగబడిపోతున్నారు. ఆ సంగతి తెలియక వచ్చాడు, ఇంద్రమోహన్. షూటింగ్ వాళ్ళ తిప్పలు వాళ్ళకున్నాయి. అటువంటి స్థలంలో షూటింగ్ అంటే రిస్క్‌తో కూడిన పని. వాళ్ళ యిబ్బందులు గమనించకుండా తమ అభిమాన హీరోను చూడాలని జనం పడే తాపత్రయం చూస్తుంటే నవ్వు వస్తుంది. నీళ్ళు పడుతుంటే గమ్మత్తుగా వుంది. ఇంద్రధనస్సులోని ఏడు రంగులకు తన జీవితాని కేదో పోలిక వుంది ఈ ఊరు వచ్చి వారంరోజులు అయినా తనింకా రూపను చూడలేదు. ఎందుకో మనసు వెళ్ళాలని ఆత్రపడుతున్నా, కాళ్ళు కదలటంలేదు. ఆమె స్నేహము మల్లెపూల సౌరభం ! ఆమె చెలిమి గులాబీల పరిమళం !

తనేదో తమాషాకు వ్రాస్తే, ఆమె దొంగ అన్నది ఇద్దరిది ఒకరిపై ఒకరికి వెళ్ళిపోయింది. వెళ్ళాలా, వద్దా ! తనీ ఊళ్ళో ఉద్యోగం చేస్తున్నట్టు తెలియదా ! తను మనసులో ఏదో దాచుకున్నప్పుడు తను వెళ్ళి పలుకరించడం బాగా వుండదేమో !

''సార్ ... సార్ నిమ్మకాయరసం కావాలా?'' బండివాడు అడిగాడు తలెత్తి చూచి, ఆశ్చర్యంగా నిలబడిపోయాడు. శల బుట్టలా అయిన పండుముసలి. ముష్టియెత్తుకుని అయినా బ్రతకవచ్చు అయినా కష్టపడి పని చేసుకుంటానని బండిని త్రోలుతున్నాడు. అలాంటివారికి చేయూత నివ్వాలి అనుకున్నాడు.

''ఓ గ్లాసు రసం ఇవ్వు'' అన్నాడు.

అతను ఉత్సాహంగా, ఓ నిమ్మచెక్క గ్లాసులో పిండి, చిటికెడు ఉప్పవేసి, దాంట్లో ఓ సోడా కొట్టి పోసి యిచ్చాడు అది తీసుకుని ఎలభై పైస లిచ్చాడు.

''అయ్యా ! పల్లీలు...'' ఆశగా చూచింది ముసలమ్మ.

''ఓ పావలావి ఇవ్వు'' అన్నాడు సోడ త్రాగి, పల్లీలు తీసుకుని ఆవిడకు పావలా యిచ్చాడు. దుమికే నీళ్ళు, నీటి తుంపర్లు, వాటి హోరు చూస్తూ క్రిందివరకు నడిచాడు.

''అయ్యా దండం...''

తల తిప్పాడు. 'లక్ష్మి నర్సింగ్ హోమ్' దగ్గర వాచ్‌మెన్ నిల్చున్నాడు.

''నీకు ఈరోజు సెలవా !''

''ఒంట్లో బాగాలేదని వచ్చేశానయ్యా కొత్తగా వచ్చిన మేనేజరుకు సీసాలు, చిరుతిండు తెచ్చి పెట్టాలి ఏమో బాబూ ! మీరు వెళ్ళిపోయారు, ఆ ఆస్పత్రి కళే పోయింది యాడి పన్లు ఆడనే ఆగిపోయినయి'' అన్నాడు

ఆపద్బాంధవిలా ఆ సమయాన వచ్చుకున్న రూపాదేవిని చూడకపోవటం తన దురదృష్టం

''శ్రీహరిగారున్నారు కదా !''

''ఫారన్ వెళ్ళొచ్చాక అయ్యగారికి తీరికెలేదు ఎప్పుడూ బొంబాయి మద్రాసు పట్నాలు తిరుగుతుంటారు'' అన్నాడు వినయంగా

అతని కళ్ళముందు పూర్ణ వివాహానికి వచ్చిన రూపాదేవి అపురూప సౌందర్యం తళుక్కుమంది అతడిలోని ఉత్సాహతరంగం తాడి ప్రమాణంగా లేచింది నెమిలిపించం రంగు జరీ బుటీల చీర, దానిపై పచ్చల హారం, వాలుజడ కాక ముడి వేసుకుంది అందంగా, హుందాగా ఉంది ఒక్క క్షణం ఇద్దరి కళ్ళు కలుసుకున్నా, ఆ అందం తన హృదయ ఫలకం మీద ముద్రింపబడిపోయింది పెళ్ళిలో గల్లంతు జరక్కపోతే తను తరువాత వివరాలన్నీ విశదీకరించేవాడు

కాని ఆ గల్లంతు కాకపోతే పూర్ణ వివాహం శోభన్‌తో జరిగేదా !

''వస్తానయ్యా ! మీమీద దొంగతనము మోపిన పాపం ఊరక్కే పోతుందా ? అన్నీ దొంగతనంగా అందినకాడికి అందుకుంటున్నారు'' అన్నాడు వెటకారంగా. అది వినలేకపోయాడు. అతనివంక తీక్షణంగా చూచాడు.

''అదికాదయ్యా ! మంచి, చెడు ఉండాలి కదా...'' అన్నాడు తడబడ్డట్టు.

''ఊఁ...'' ఓ రూపాయి కాగితం తీసి అతని చేతిలో పెట్టాడు. అతనికి ఉరుకుతున్న నీటిని చూచి ఓ నీటి బిందువు అయిపోవాలని కోర్కె కల్గింది. అలాగే నడుస్తూ చివరవరకు వెళ్ళాడు. ప్రప్రథమంలో కట్టిన ఆనకట్ట సగం కూలి కనిపించింది. మెల్లగా వెనుతిరిగాడు. అదే దారమ్మట యెన్నోసార్లు రూపాదేవి ఊరు వెళ్ళాడు.

'రిషి రాజీ'లో చంద్రమోహన్



ఒక్క క్షణంలో జరిగే మార్పులకు అర్థం చెప్పలేము అందుకే జీవితం క్షణభంగురం అన్నారు ఇంటికి వచ్చేసరికి తల్లి, తండ్రి, పూర్ణ కూర్చుని ఉన్నారు

"ఉత్తరం వ్రాయలేదేం ?" నొచ్చుకుంటూ తాళం తీశాడు

"ఆదివారమే కదా అని వచ్చాం" అన్నారు

ఈ ఇల్లు చిన్నది ఫైలాన్ కాలనీలో



పెద్ద ఇల్లు దొరుకుతుంది అది తీసుకుని ఉత్తరం వ్రాయాలనుకున్నాను " వాళ్ల సామాన్లు లోపల పెట్టాడు

"చందూ వెళ్లిపోయాడు అల్లుడేమో చదువు అయ్యేవరకు అమ్మాయినిక్కడే వుండమన్నాడట ఏమోరా, ఏం తోచలేదు వచ్చేశాము" అన్నది జయమ్మ

"ఏం పూర్ణా !" చెల్లెలివంక చూచాడు ఆమె కళ్లు దేదీప్యమానంగా వెలుగుతున్నాయా అన్న భ్రమ కల్గిస్తున్నాయి ఎప్పుడూ అందమయినదే, అయినా ఆ అందానికి మెరుగు పెట్టినట్లు కనిపిస్తుంది చెవులకున్న జూకాలకు బదులు రింగులు, జడ వేసుకోవటంలో మార్పు స్పష్టంగా కనిపించాయి

[ఇంకా వుంది]

## పిండి వంటలు

### పాల జంతికలు

కావలసినవి :— పాలు 1 కప్పు, వరి పిండి 4 కప్పులు, వెన్న చిన్న నిమ్మకాయంత, ఉప్పు, వాము సరిపడినంత, నూనె—300 గ్రాములు.

తయారుచేయు విధము :— బియ్యం నానబెట్టి పిండికొట్టి జల్లించుకోవాలి. పిండి తడి ఆరకుండానే ఆ పిండిలో వెన్న, ఉప్పు వేసి వాము నూరి కలపాలి. చిక్కనివి పచ్చిపాలు తీసుకొని ఈ పిండిని ముద్దలా కలిపి ఉంచుకోవాలి నీరు పోయకూడదు. పట్టినన్ని పాలు పోసుకోవాలి ఈ పిండిని జంతికల గొట్టాలలో పెట్టి నూనె కాగనిచ్చి అందులో వత్తుకోవాలి దోరగా వేగనిచ్చి చిల్లుల అప్పకతో తీయాలి ఇవి తెల్లగా ఉండి గుల్లగా విచ్చును. వారం రోజుల వరకు నిలవ ఉంటాయి. ఇవి చిన్న పిల్లలకు జబ్బు చేయవు.

— కె. కుమారి.

### చెప్పాపమ్

బియ్యము 1 కిలో, కొబ్బరికాయలు 2; కోడిగ్రుడ్లు 4, 20 గ్రాములు ఉప్పు; నూనె అరకిలో; నీళ్ళు 4 గ్లాసులు.

బియ్యము మూడు గంటలసేపు నీటిలో నానబెట్టి బాగా ఆరబెట్టి మెత్తగా పిండి విసిరించి పిండి జల్లెడతో జల్లించి స్టౌమీద బాణలి పెట్టి కొంచెగ నూనె వేసి బియ్యపు పిండిని ఎఱ్ఱగా [దోరగ] వేపి దింపి ఉంచవలెను కొబ్బరికాయలు తురిమి రోటిలోవేసి రుబ్బుతు నీరుపోసి కొబ్బరిపాలు తీయవలెను. ఒక పెద్ద గిన్నె తీసుకొని కోడిగ్రుడ్లు కొట్టివేసి, బియ్యం పిండి కొబ్బరి పాలు, ఉప్పువేసి పూరీల పిండి మాదిరి తడిపి ఉంచుకోవలెను ఇక అన్ని తయారయిన పిదప స్టౌమీద బాణలి పెట్టి నూనె పోసి కాగిన పిదప పైన తడిపి ఉంచుకొన్న పిండి ముద్దను చిన్న చిన్న ఉండలుగ చేసి మరల ఆ ఉండలను అరచేతిలో గాని అరిటాకు మీదగాని పెట్టి పలచగ వత్తి నూనెలో వేసి దోరగ వేపి తీసివేయవలెను

— మాదిరెడ్డి లక్ష్మి.

# 1978 దీపావళి కథలపోటీ

## మొత్తం రు. 5000 ల బహుమతులు

**ఈసారికూడా దీపావళికి కథానికలపోటీ పెడుతున్నాము.. పోయినేడాదిలాగే యీ ఏడు కూడా సంపాదకుని ఎన్నికలో ఉత్తమంగా వచ్చిన ఐదు కథలను ఆంధ్ర సచిత్ర వారపత్రిక దీపావళి సంచికలో, ఆ తరువాతి సంచికలో వేస్తాము. ఆటు తరువాత పాఠకుల బ్యాలట్ నిర్వహిస్తాము.**

## ముగింపు తేదీ 16-9-'78 శనివారం

పోటీలో ఎన్నికైన ఐదు కథలకు ఒక్కొక్కదానికి రు. **600** లు చొప్పున బహుమతులు యిస్తాము. ఆటు తరువాత బ్యాలట్‌లో ప్రథమ, ద్వితీయ, తృతీయ స్థానాలలో వచ్చిన మూడు కథలకు రు. **600**, రు. **500**, రు. **400** ల వంతున అదనపు బహుమతులు యివ్వడమే గాక మిగిలిన రెండు కథలకు రు. **250** ల చొప్పున కన్సొలేషన్ బహుమతులను అందజేస్తాము.

- ★ 'కథానిక' ఆంధ్ర సచిత్ర వారపత్రికలో నాలుగు పేజీలు మించకుండా వుండాలి. 12 అరటావులు దాటకుండా వ్రాస్తే చాలు నిడివి ఎక్కువ అయిన కథలకు బహుమతి రాగల అవకాశాలు చాలా తక్కువ అని గమనించాలి.
- ★ కథావస్తువు తెలుగువారి సామాజిక జీవితానికి సంబంధించి వుండాలి
- ★ అనువాదం, అనుసరణ, అనుకరణ, కాపీ కథలు పంపకూడదు ప్రసారమైన, ప్రచురణ అయిన లేదా ఇతర పత్రికలకు పంపబడి పరిశీలనలో వున్న కథలు అసలే పంపకూడదు.
- ★ పై అంశాల మేరకు హామీ పత్రం ప్రతి కథతోపాటు విధిగా వుండి తీరాలి కలంపేరు వాడినా అసలు పేరు, యింటిపేరు సహా పూర్తిగా విడిగా స్పష్టంగా పూర్తి చిరునామాతోపాటు అందిన కథలనే పరిశీలించ వీలవుతుంది.
- ★ కథలతోపాటు రచయితల పేర్లు పడవు. బ్యాలట్ తరువాత వారి పరిచయం తోనే వేస్తాము
- ★ రచనలపై పేచీలు వస్తే రచయితలే బాధ్యత వహించవలసి వుంటుంది
- ★ పోటీలో నెగ్గిన కథల రచయితలు తమ ఫొటో, జీవిత విశేషాలు మొదలైనవాటిని పంపి, వాటి ప్రచురణకు అంగీకరించాలి.
- ★ ముగింపు తేదీ దాటిన తరువాత అందిన కథలను మామూలు ప్రచురణకు వీలునెంబడి పరిశీలిస్తాము పోటీకి పంపిన కథలను ఎటి పరిస్థితులలోను త్రిప్పి పంపలేము

సం॥

# ఫాలాక్షుని డైరీ

## హీరోయిన్‌ను చూసే పద్ధతి ఇదా ?

నటి హేమమాలిని నటించే అన్ని సినిమాలూ తప్పక చూసే పాకిస్థాను దేశీయుడొకడు ఆమెను నేరుగా చూడాలనే కోర్కెతో బొంబాయి వచ్చి, పగలంతా ప్రయత్నించి, చివరకు అర్ధరాత్రి ఆమె యింటోకి జొరబడి వో గదిలో ప్రవేశించి, ఆ గదిలో నిద్రపోతున్న పనిమనిషిని లేపి, హేమమాలినిని యీ గదికి రమ్మని ఫోనులో చెప్పు. లేకపోతే నీ పీక యీ కత్తితో కోసేస్తానని వో కత్తి ఆమె పీకవద్ద సిద్ధంచేశాడట. ఆ పనిమనిషి హేమమాలినికి యీ విషయం ఫోనులో చెప్తే ఆవిడ అదరాబాదరా లేచి, తలిదండ్రులను లేపి, వారితో ఆ గదికి వెళ్ళిందట. ఆ రసికుడామెను చూడగానే ఆనందంతో కత్తి క్రింద పారేసి, విస్మృడయ్యాడట. వెంటనే అతన్ని పనివారు చుట్టుముట్టేశారట. హేమమాలిని తండ్రికి గుండె పోటు వున్నదట. ఇదివరకే రెండుసార్లు వచ్చిందట ఈ సంభవంలో ఆయన ఆవేశపడడంవల్ల మూడో సారి వచ్చిందట. ఫలితంగా ఆయన (జూలై 20వ తేదీన) చనిపోయారట.

## ఇదేం? పితృవాక్య పరిపాలన?!

రాజపాళయం (తమిళనాడు) అనే వూరిలో వో చిన్న హోటలు పెట్టుకుని బొటుంబాన్ని పోషించుకుంటున్న ఒకాయనకు ఏడుగురు ఆడపిల్లలట. అందులో ఇద్దరికి పెళ్ళి అయినదట. మిగతా వారిలో, 20 ఏళ్ళ ముత్తులక్ష్మి, 18 ఏళ్ళ అన్నలక్ష్మి, 17 ఏళ్ళ సెల్వలక్ష్మి, 16 ఏళ్ళ ధనలక్ష్మి కలసి వో రోజు ట్రాన్సిస్టరులోని పాటలు ఎంచక్కా వింటూ కూర్చున్నారట. దానివల్ల పొయ్యి మీద పెట్టిన పాలన్ని పొంగి, పొయ్యిలో పడి పోయాయట దాంతో వారి తండ్రికి కోపం వచ్చి "కట్టకట్టుకు చావండి" అన్నాడట. ఆ మాటకు మనస్సు విరిగిపోయిన ఆ నలుగురు అప్పచెల్లెళ్ళు కట్టకట్టుకుని నూతిలో దూకి, ఆత్మహత్య చేసుకున్నారట. పితృవాక్య పరిపాలనంటే యిదే కాబోలు.

### ఆలీబాబా నలభై దొంగలు

"ఆలీబాబా నలభై దొంగలు అనే సినిమా, రష్యా దేశం మన దేశంతో కలసి తీస్తున్నదట. ఈ సినిమాలో నటి హేమమాలినీ, ధర్మేంద్ర నటిస్తున్నారట. ఈ సినిమా షూటింగు కోసమామె రష్యా వెళ్ళవలసి వున్నదట తన తండ్రి చనిపోయినందువల్ల హేమమాలిని రష్యా వెళ్ళలేదట. షూటింగు కొన్నాళ్ళాగి పెట్టకోమని ఆదేశం ఆ దేశం వెళ్ళిందట.

### నర్సులైనా పెళ్ళి తప్పదా ?

పశ్చిమజర్మనీలో కేరళకు చెందిన మహిళలలో నాలుగువేలమంది నర్సుపనిచేస్తున్నారట. వీరంతా అవివాహితులట. అక్కడి ప్రభుత్వం ఇదంతా నచ్చలేదని ఆ "నర్సు" లందరూ తమదేశపు వారిని వివాహంచేసుకుని ఆదేశంలోనే స్థిరపడి పోవాలని, దానికిసమ్మతంలేనివారు వుద్యోగాన్నీ, దేశాన్నికూడా వదలిపోవాల్సివుంటుందని ఆదేశం యిచ్చిందట.

### 'నువ్వు తాగు- నేను ఛస్తా'

రాసిపురం (తమిళనాడు)కు చెందిన పుదుపట్టి గ్రామంలో రామసామిగవుండరు తాను సంపాదించినది ఎంచక్కా తానే తిని, తాగి అనుభవించి యింటికి ఏమాత్రమూ యివ్వక పోవడంవల్ల అతని భార్య పాపాయి నిత్యం నెత్తీ నోరూబాదుకుంటూ వుండేదట. ఎన్నిచెప్పినా, ఎంతగోలచేసినా భర్తలో మార్పు కనబడకపోయేసరికి ఆమె కాఫీలో విషంకలిపి అప్పో తన పిల్లలు 12 ఏళ్ళ గణేశనుకు, 9 ఏళ్ళ మాణిక్యానికి చెరికొంచెం యిచ్చి, తాను మిగిలింది త్రాగేసిందట. ఫలితంగా ముగ్గురూ, వాంతులు చేసుకుని విలవిలా తన్నుకు చనిపోయారట.

### లండన్‌లో కూడానా ?

లండన్‌లో పార్లమెంటు జరుగుతుండగా ప్రేక్షకుల గ్యాలరీ నుంచి గుడ్డపు పెంటలు గాలిలో లేచి ఎం.పి. ల మీద పడ్డాయట. అవి విసిరిన యిద్దరు మహిళలు తమగురి తప్పనందు కానందించారట. ఆ యిద్దరు మహిళలలో ఒకామె మాల్టా దేశపు ప్రధాని కూతురు యూనామింటాఫ్ అట !

### తుని-పాకిస్తాను

పాకిస్థాన్‌లో కిళ్లీలు వాడకం ఎక్కువట. కాని అక్కడ తమలపాకులు పండవట. ఆ దేశం ఏటా ఆరుకోటి రూపాయల తమలపాకులు దిగుమతి చేసుకుంటూంటదట. ఆ వెండర్సిండియా కివ్వరాదూ తుని, పాకిస్థానుకు దగ్గరకాదా !

### ఉపన్యాసం ఖర్చు 92 వేలు

ఈ మధ్యన ప్రధాని మొరార్జీ ప్రపంచయాత్ర చేసిన సందర్భంలో అమెరికా యునైటెడ్ నేషన్స్‌లో మాట్లాడి నపుడు ఆ సంఘటనను టెలివిజను ద్వారా మన దేశం చూడ్డానికి 92 వేల ఆరొందలరవై రూపాయలు ఖర్చయినదట. అనగా ఆ సంఘటనను టెలివైజ్ చేయడానికి అయిన ఖర్చన్నమాట. ఈ ఖర్చు అంతే ఓరాదు కాదని, యింకా కొన్నిబిల్లులు రావలసివున్నాయి. అవన్నీ వచ్చాకగాని, అసలైన ఖర్చెంతో తేలదని రాజ్యసభలో కేంద్ర సమాచారశాఖ మంత్రి అద్వానీ అన్నారట. అదన్నీ !

### మొట్టమొదటి పత్రిక

లండన్‌లో 1622 లో "వీక్లీన్యూస్" అనే పత్రిక ప్రచురితమయ్యిందట. ఇదే ప్రపంచంలోని మొట్టమొదటి పత్రికట.

### చైనా జనాభా ?

చైనాలోని జనాభా సుమారు తొంభయి కోట్లట. అసలింత వరకూ చైనాలో జనాభా లెక్కలు తీయనేలేదట. జనన మరణ లెక్కలను బట్టి తీసిన జనాభా లెక్కలేదటక్కడ.



## అవీ – ఇవీ – అన్నీ

**విశ్వనాథవారి విశిష్టత**

విశ్వనాథ సత్యనారాయణగారి రచనల మీద వివిధ రచయితలు సమీక్షకులు వ్రాసిన వ్యాసాల సంకలనం వెల 2 రూపాయలు ప్రతులకు శ్రీ కళాప్రచురణ విభాగం, శ్రీ కళాసమాజం బుద్ధవరపువారివీధి కాకినాడ అనివార్యయాలి.

**ముఖమూ సుందరీ**

ఇచ్ఛాపురపు జగన్నాధరావు రచన. పుటలు 156, వెల ఆరురూపాయలు. ముఖచిత్రం చంద్ర

**తీరాలు కెరటాలు**

తీరాలు-కెరటాలు అన్న యీ నవలికలో 144 పేజీలున్నాయి రచయిత కె రాజేశ్వరరావు వెల ఆరురూపాయలు

**పడిలేచిన కెరటం**

డా॥ చంద్రిక రచించిన యీ నవలికలో 122 పుటలున్నాయి వెల 6 రూపాయలు

**జీవితమొక జీవనాది**

చిట్టిబాబు రచన గోపీ ముఖచిత్రం 172 పుటలున్నాయి వెల ఏడురూపాయలు

**మధురక్షణాలు**

'మాన్స' రచించిన యీ నవలలో 174 పుటలున్నాయి వెంబు ముఖచిత్ర రచన వెల ఏడురూపాయలు

**విజయతే గోపాల చూడామణీ !**

ఇదికూడా 'చిట్టిబాబు' రచనే. 204 పుటల యీ పుస్తకం ఖరీదు 8 రూపాయలు

**రేపటి వెలుగు**

ఇదికూడా చిట్టిబాబు రచనే ముఖచిత్రం చంద్ర, 180 పేజీలు వెల 7 రూపాయలు

ఈ పై నవలలన్నింటినీ శ్రీ కవితా ఎల్లి శేషన్న ఏలూరు రోడ్డు విజయవాడ-2 వారు ప్రచురించారు

**'కాస్మోస్ 1028' ప్రయోగం**

సోవియట్ యూనియన్ జులై 29 నాడు కాస్మోస్–1028 ఉపగ్రహాన్ని ప్రయోగించింది ఈ ఉపగ్రహం భూమికి 272 కిలోమీటర్ల గరిష్ఠ దూరంలో, 182 కిలోమీటర్ల కనిష్ఠ దూరంలో 671 డిగ్రీల వాలులో ప్రతి 88.7 నిమిషాల కొక పర్యాయం భూమి చుట్టూ పరిభ్రమిస్తూ వుంది

ఈ ఉపగ్రహంలోని పరికరాలన్నీ సజావుగా పనిచేస్తున్నాయి. ఈ ఉపగ్రహం అందిస్తున్న సమాచారాన్ని భూతల కేంద్రం విశ్లేషిస్తూ వుంది.




# నీలం 501

## డిటర్జెంట్ బార్

## తెల్లదనానికి మొదటిది, ప్రకాశానికి మొదటిది

(మీరు కోరే లక్షణాలన్నీ ఉన్నాయి:

- డిటర్జెంట్ కావడం వల్ల అధికంగా ఉతికే శక్తి.)
- బార్ కావడం వల్ల అధికంగా పొదుపు.
- ప్రత్యేక రీతిలో గట్టిగా తయారు చేయబడినందువల్ల తొందరగా అరిగిపోదు, ముద్ద కాదు.
- తెల్ల బట్టలైనా, రంగు బట్టలైనా ఉతికేందుకు సరిగ్గా తగినట్టిది.
- పట్టుకోవడానికి అనువుగా ఉంటుంది.

## మరొక 501 విజేత!

(టాటా ఆయిల్ మిల్స్ కంపెనీ లిమిటెడ్)

(CAST-2 223 TEL)

# వీడ్కోలు



పంతుల జోగారావు

పది దాటి అరగంటయింది టైము

మొదటి పీరియడు జరుగుతోంది లీజరున్న టీచర్లు తప్ప తక్కిన వాళ్ళంతా క్లాసు రూముల్లో వున్నారు ఫస్టు ఫారం కుర్రాళ్ళు తెలుగు మేష్టారి పద్యానికి వంత పాడుతున్నారు హెడ్మాష్టారు మొదటి రౌండు స్కూలంతా చుట్టుముట్టి ఆఫీసు రూంలోకి వెళ్ళిపోయేరు స్టాఫ్ రూంలో డ్రిల్లు మేష్టారు శ్రీమన్నారాయణ దేశ రాజకీయాలగురించి అనర్గళంగా వుపన్యసిస్తున్నారు అతనన్న దానికి తలూపుతున్నారు డ్రాయింగ్ టీచర్ విశ్వనాథం

'ఈ డర్టీ స్కూల్లో ప్రయోగం చేదామంటే ఒక టెస్టు ట్యూబూ సర్రైంది వుండదు- ఒక బీకరూ వుండదు ఖర్మ' అని తెగ విసుక్కుపోతూ లేబరేటరీ గుమ్మం దగ్గర నించున్నారు సైన్సు చెప్పే రామారావు గారు

లేటుగా వచ్చిన లెఖ్ఖలు మేష్టారు శ్రీరామ్మూర్తి నేరుగా స్టాఫ్ రూంలోకి వచ్చేరు

'అందరికీ ఓ శుభవార్త' అని ప్రారంభించేరు అంతా కుతూహలంగా అతని వేపు చూసేరు

శ్రీరామ్మూర్తి గొంతు సవరించుకుని చిన్నసైజు ఉపన్యాసం ప్రారంభించేరు 'ఇక్కడగల యావన్మందికీ నేను ప్రకటించబోతున్న వార్త గొప్ప సంతోషాన్ని కలిగించగలదు.'

'చెప్పండి సార్- సస్పెన్స్‌తో చంపక' డ్రిల్లు మేష్టరు వుండబట్టలేక ఉత్కంఠతో తొందర చేసారు

శ్రీరామ్మూర్తి నవ్వి- 'వస్తున్నామరి. ఇది క్రీడాచార్యుల వారికి మరింత మోదాన్ని కలిగిస్తుందనటంలో సందేహం లేదు.. అంతా వినండి-మన మ ఘ వ శ్రీ పెద్దదొరవారికి బదిలీ అయిపోయింది ఏ వూరని అడగండి చెబుతాము- కాకులు దూరని కారడవి- చీమలు దూరలేని చిట్టడవి- రోడ్డు పాయింటుకి నీటువేపు నుంచి వెళ్ళినా అక్షరాలా ఆరు కిలోమీటర దూరం నడవక తప్పదు- మన పరిషత్ స్కూళ్ళ గల పనిష్మెంటు వూళ్ళు పదింటిలోనూ అదొకటి- 'ఫలానా' వూరు అని ఇవాళే టపాలో ఆర్డరు వస్తోంది' అంత సమాచారాన్ని సేకరించి అందరికీ ముందుగా వెల్లడించ గలిగినందుకు గర్వంగా వుందాయనకు

అంతా ఆశ్చర్యపోయారు మహదానందభరితులయేరు

'వెరీగుడ్ మూర్తిగారూ! భలే ఘటికులండీ తమరు ఇంత బోగట్టా ఎలా సంపాదించగలిగేరండి సార్?' అని మెచ్చుకున్నారు

'వారికేమండీ బాబూ! జడ్ పి ఆఫీసులో డి వన్ గారో, సూపరెంటుగారో తుమ్మితే క్షణాల మీద ఆ వార్త వచ్చి వీరి చెవిని పడిపోతుందంతే-' క్రాఫ్టు టీచరు అతన్ని పొగడ్తలతో ముంచెత్తేసారు

స్టాఫ్ రూంలో ఈ సంభాషణ క్షణంలో స్కూలంతా ప్రాకిపోయింది. ఫస్టు పీరియడు ఎప్పుడెప్పుడవుతుందా అని అంతా ఎదురుచూచి బెల్లు కాగానే అక్కడికి చేరారు టీచర్లు

రెండవ పీరియడు క్లాసులున్న వాళ్ళు అలాంటి రసవత్తర ఘట్టంలో లేచి వెళ్ళవలసి వచ్చినందుకు విసుక్కుంటూ వెళ్ళారు

తెలుగు మేష్టరు అవధాన్లుగారు పొడుం పట్టు దట్టించేరు 'భేషైన ముక్క ఏం షోగ్గా చెవిని వేసావోయ్ అబ్బీ - ఈసారి అరియర్ బిల్సేవేనా కలిస్తే పార్టీ యిస్తాను కానీ- రస నిర్భరమైన ఆ మహద్వాక్యం మరోసారి ట్యూన్ చెయ్యి బాబూ!' అనడిగేరు, శ్రీరామ్మూర్తిని

ఆయన చమత్కారానికంతా విరగబడి నవ్వేరు

స్టాఫ్ సెక్రటరీ లక్ష్మణరావు అతను సోషల్ స్టడీస్ చెప్పే టీచరు సీనియర్ బి ఇడి అసిస్టెంటు పేనల్ లిష్టులో అతని పేరు నమోదై వుంది నేడో రేపో హెడ్మాష్టరు గిరీ అందుకోవలసిన వ్యక్తి. అందువల్ల అతను కొంచెం బింకాన్ని అభినయిస్తూ వుంటారు అతన్ని విషయమై ఎలాంటి కామెంటూ చేయకుండా మౌనం వహించేరు.

పెద్దదొర వారిగా పేర్కొనబడిన ఆ వ్యక్తి ఆ స్కూలు హెడ్మాష్టరని వేరే

చెప్పవలసిన పని లేదు. వారి పేరు ఆనంద రావు. కానీ వారెప్పుడూ తీవ్ర శిరోభారంతో బాధపడుతున్న వారిలాగా 'విషాద చక్రవర్తి' లాగానే వుంటారు. 'మనుష్యులు నమ్మ దగినవారు కారు; తత్రాపి ప్రత్యేకించి తన క్రింద పని చేయు అసిస్టెంటు లెవరూ ఏంత మాత్రమూ విశ్వసించ దగిన వారు కారు' అనే అభిప్రాయాన్ని వేదవాక్యంలా నమ్ముకున్న మనిషిలా వుంటారు. ఆ కారణం చేత ఆ స్కూల్లో హెడ్మాష్టరుకీ తతిమ్మా స్టాఫ్‌కీ మధ్య అవగాహన కొరవడింది. సుహృద్భావం బెడిసి కొట్టింది. రుసరుసలతోనూ, పరస్పర నిందా వాక్యాలతోనూ ఆ స్కూలు వాతావరణం ఎప్పుడూ గొడవ గొడవగా వుంటుంది. ఎక్కు పెట్టిన బాణంలా టెన్షనుతో కూడినదై వుంటుంది. పేలబోతున్న టపాకాయ లాగా ఆందోళన కరంగానూ వుంటుంది.

అలాంటి వాతావరణంలో హెడ్మాష్టరుకి ట్రాన్స్‌ఫరు అయిపోయిందని తెలిస్తే— అందులోకీ ఓ 'దిక్కుమాలిన' ప్రదేశానికి బదిలీ అని తెలిస్తే— ఆ స్టాఫ్ ఆనందానికి మేర ఏం వుంటుంది?

ఇంతలో టపా వచ్చింది. అటెండరు కేశవయ్య టపా హెడ్మాష్టరు రూంలోకి తీసుకుని వెళ్ళాడు. అంతా ఆతృతగా అటు వేపు చూడసాగేరు. వినబోయే ఆనందకరమయిన 'అధికార ప్రకటన కోసం' కుతూహలంగా కళ్ళూ, చెవులు అప్పగించి సిద్ధమయేరు—

కాని— టపాకాయ పేలలేదు! ఎక్కు పెట్టిన బాణం పుటుక్కున విరిగిపోయినట్లయింది. ఏమంత ఇంపార్టెంట్ కాని కాగితం ఏదో సర్క్యులేట్ చెయ్యబడింది అంతా నీరుకారి పోయేరు. ఇవాళ హెడ్మాష్టరుగారి బదిలీ ఆర్డరు రాలేదూ!

మూర్తిగారు చెప్పిన దంతా 'గేస్' కబురేనా?

శ్రీరామమూర్తి అట్టహాసంతో చిందులు వేసారు. 'నాన్సెన్స్! ఇవాళ టపాలో వచ్చి తీరాలి— వస్తుంది— వచ్చే వుంటుంది— నేను డిస్పేచ్ క్లార్క్‌నే, అడిగి తెలుసు కున్నాను— రాక తప్పదు— వచ్చిన ప్రతి

## నిరుపేదలం

ఆకసమును అందుకొని
అరుగులన్ని చేసాము
మేఘాలను తలుపులుగా
సంచి యిల్లు కట్టాము
తారలను ఏరి కూర్చి
తోరణాలు కట్టాము
భగవంతుడు పంపించిన
భోజనాలు చేసాము
సూర్యునితో చంద్రునితో
బంతులాడు కున్నాము
తెల్లవారి నిద్రలేచి
తెల్లమొహం వేసాము

—రాధిక

ముఖ్యమయిన కాగితాన్ని బయట పెట్టకుండా దెబ్బలాటకి దిగితేనే కానీ చూపించని గుణం ఈయనకి తొలి నుంచీ వుంది— పదండి- ఏ సంగతీ అడుగుతాను' అని హెడ్మాష్టరు గదివేపు దారితీసారు.

ఇష్టం వున్న వాళ్ళూ, లేనివాళ్ళూ- కేవలం తమాషా చిత్తగిద్దామనే ఉత్సాహంతో కొందరూ— మొత్తానికి అంతా అతని వెంట వెళ్ళారు.

'ఇంకేం టపా వచ్చింది మాష్టారూ' వేరుగా అసలు విషయాన్నే కదిపారు మూర్తి.

'స్టాఫ్‌కి సంబంధించి వంతవరకు మరేం లేవండి' నేర్పుగా సమాధానం చెప్పారు హెడ్మాష్టరుగారు.

అందరి కళ్ళూ సంతోషంగా మెరిసాయి.

'అంటే— మీకేదో వచ్చిందన్నమాట — మాకు తెల్సులెండి సార్. మీకు ట్రాన్స్ఫరార్డరు రాలేదూ! వచ్చిన కాగితాలని దాచెయ్యడం ఎప్పుడూ మంచి గుణం కాదు సార్— ఇహనైనా మీరు మారాలి. స్టాఫ్‌కి వ్యతిరేకంగా వుంటే వర్కు సాఫీగా జరగదు మీరు గుర్తించాలి' అన్నారు మూర్తి ఆవేశంగా.

హెడ్మాష్టరు ఆవేశంతో చివ్వున లేచారు. 'అంటే— ఏమిటి మీరనేది? — ఇంతకీ అఫీషియల్ కరెస్పాండెన్స్ గురించి అడగడానికి మీరెవరు. పని జరగదని బెదిరిస్తున్నారా! ఎలా జరగదో చూస్తాను — మైండ్ యువర్ బిజినెస్' అని హెచ్చరించేరు.

అవధాన్లుగారు కలగజేసుకుని అతన్ని చల్లబరిచేరు 'పోనీలెండి మాష్టారూ— అతని మాటకేంగానీ —ఆ వచ్చింది తమరి ట్రాన్స్ఫర్ ఆర్డరే కద? ఎక్కడకి వెళ్ళమన్నారేమిటి మిమ్మల్ని?' వెటకారం ధ్వనించేలా అడిగేరు.

'ఎవరికి తెలీంది? 'ఫలానా' స్కూలికి కాదూ!' ఉక్రోషంగా అన్నారు మూర్తిగారు.

'అక్కడికి మీరే దగ్గిరుండి యీ బదిలీ చేయించినట్లు మాట్లాడుతున్నారే! ఆఁ! ట్రాన్స్ఫర్ ఆర్డరే వచ్చింది—ఇదిగో— మీకే కాదు ఆఫీసులో నాకూ యిన్ఫ్లుయెన్స్ వుంది. ఈ ఆర్డర్ని నాల్రోజుల్లో కాన్సిల్ చేయించుకొస్తాను చూడండి'— అని సవాలు విసిరేరు హెడ్మాష్టరు.

# వీడ్కోలు

ఆ తరువాత హెడ్మాష్టరుగారు స్కూలుకి వారం రోజులు పాటు శలవు పెట్టారు 'ఆయన ఎన్ని ప్రయత్నాలు చేసినా జరిగిపోయిన ఈ బదిలీ కేన్సిలవటం కల్ల' అని బల్లగుద్ది మరీ వాదించేరు లెక్కలు మాష్టారు. ఆ విషయమై అతను ఏభైకీ వందకీ పందెం కూడా వేసారు.

హెడ్మాష్టరు తిరిగి ఎప్పుడు స్కూలికి వస్తారా అని అంతా ఎదురు చూడసాగేరు వారు రిలీవ్ అయిపోయే రోజున సెండాఫ్ మీటింగులో మాట్లాడటానికి— వ్యంగ్యం, హేళన అంతర్భూతమయిన ఉపన్యాసాన్ని అవధాన్లుగారి చేత వ్రాయించుకున్నారు మూర్తిగారు.

**మనిషి శరీరం నమూనా**

టోకియోలోని కోకన్ కంపెనీవారు మనిషి శరీరానికి నమూనా తయారు చేసారు అన్ని విధాలా మనిషి శరీరం మాదిరి వుంటుంది. ఈ నమూనా వైద్య కళాశాలలో చాలా పనికి వస్తుంది. ఈ నమూనా 'సిలికోన్' రబ్బరుతో చేస్తారు. యీ డమ్మీలు మనిషి శరీరం మాదిరిగానే చలిస్తాయి. పొట్ట, తల నిర్మాణం అత్యద్భుతంగా వుండాలి. యీ డమ్మీలు పొట్ట నిర్మాణం కేన్సరు కనుక్కొనేటందుకు ఉపకరిస్తుంది. దీని ఖరీదు 3,000 పౌన్లు. యీ నమూనాలో తల భాగంలోని చెవులు, ముక్కు, కంఠం అటోనారింజోలాజికల్ చదువుకు ఎంతో ఉపకరిస్తుంది.

చివరికా రోజు రానే వచ్చింది.

హెడ్మాష్టరు వచ్చేరు. వారి ముఖం ప్రసన్నంగా లేదు. 'సార్ రిలీవ్ అయిపోతారు కాబోలు— సెండాఫ్ మీటింగ్ యేర్పాటు చేస్తున్నాం' అన్నారు టీచర్లు. హెడ్మాష్టరు అభ్యంతరం చెప్పలేదు.

మీటింగ్ యేర్పాటయింది. టీపార్టీ చేసారు. పార్టీ అయేక ఉపన్యాసాలు. 'ఈ దెబ్బతో గ్రీ యీ మానవుడు తారెత్తిపోవట్సిందే' అనుకుంటూ తన ఉపన్యాస పాఠాన్ని మరోసారి నెమరు వేసుకున్నారు శ్రీరామ్మూర్తిగారు.

అవధాన్లుగారు నిందా గర్భితమైన వ్యాజస్తుతి పద్యాన్నొకదానిని రడీ చేసుకున్నారు (డ్రిల్లు టీచరు తనకు నారితో లోగడగల పేచీలనీ దృష్టిలో వుంచుకుని— అతన్ని సున్నితంగా దులపేయాలని తహతహలాడుతున్నారు.

అంతా ఇలా తమ తమ ప్రయత్నాలలో వుండగా హెడ్మాష్టరుగారు లేచి నించున్నారు గొంతు సవరించుకున్నారు.

"ఈ తేనీటి విందుచేసి నాకు వీడ్కోలు సభ యేర్పాటు చేసిన నా సోదర ఉపాధ్యాయులందరికీ నమస్కారములు. సభా సాంప్రదాయాన్ని అనుసరించి నా కృతజ్ఞతా నివేదనం చివరి అంశంగా వుండవలసి వుంది. కాని నేను మొదటే మాట్లాడబోవటానికి ఒక ప్రత్యేకమయిన కారణం వుంది. విన్నవిస్తాను.

"దైవ కృపవల్లనైతేనేమి— శతధా బహుళనుయిన నా ప్రయత్నాలవల్లనైతే నేమి— నాకు జరిగిన ట్రాన్స్ఫర్ కేన్సిలయిందని సంతోషంతో మీకు తెలియజేస్తున్నాను. అయితే— ఇదే సందర్భంలో మీకొక విచారకరమయిన వార్త చెప్పవలసి వస్తున్నందుకు మాత్రం చింతిస్తున్నాను... మన లెఖ్ఖల మేష్టరుగారు— శ్రీ శ్రీరామ్మూర్తిగార్కి ఆ 'ఫలానా' వూరు బదిలీ జరిగింది. ఆర్డరు ఇప్పుడే పోస్టులో అందుకోవడం జరిగింది. వారి నిప్పుడే రిలీవ్ చేస్తున్నాను. ఈ సెండాఫ్ పార్టీ వారికి జరిగిందిగ భావించ గోర్తాను. స్కూలు డిసిప్లిన్‌కి భంగకరంగా ప్రవర్తిస్తున్నారన్న కారణాన్ని పైవారి అధికారులు యీ ట్రాన్స్ఫర్ చెయ్యటం విచారకరం— ఇకనైనా వారు— తాము వెళ్ళబోతున్న క్రొత్త స్థలంలో అందరి అభిమానమూ చూరగొన గలరని ఆశిస్తున్నాను. శ్రీరామ్మూర్తిగారి గురించి ఉపాధ్యాయ సోదరులు ఉపన్యసించవచ్చును—" అని చెప్పి, కూర్చున్నారు.

లెఖ్ఖలు మేష్టారి ముఖం వివర్ణమైపోయింది! ఉపాధ్యాయు లందరూ నోళ్ళు వెళ్ళబెట్టారు...

## సైన్సులో సరదాలు

# మైదా పిండితో బాంబు

— డాక్టర్ మహీధర నళినీమోహన్.

దీనికి కావలసిన వస్తువులు: 1. గుండ్రని రేకుడబ్బా 2. కొవ్వొత్తి 3. మైదాపిండి 4. గళ్లా 5. రబ్బరు గొట్టం.

గుండ్రని పెద్దడబ్బా, దానికి బిగువైన మూత కావాలి. ఆ డబ్బా అడుగున ఒక వారగా గళ్లాతోక దూరేపాటి చిల్లు మేకుతో పొడిచి, అందులో గళ్లాతోక దూర్చి, మిగిలిన చిల్లులు లక్కతో గాని, కొవ్వొత్తి తాలూకు కొవ్వుతోగాని మూసెయ్యాలి. ఆ గళ్లాతోకకి బిగువుగా పట్టే రబ్బరు గొట్టం బిగించి పైకెత్తి పట్టుకోవాలి డబ్బా మూత తీసి, ఒక పెద్ద చెమ్చాడు పొడి మైదా గళ్లాలో పొయ్యాలి. వెలిగించిన కొవ్వొత్తిని డబ్బాలో ఒక వారగా పెట్టాలి డబ్బా మూత బిగించాలి.

అంతే మన బాంబు తయారైంది.

రబ్బరుగొట్టపు రెండవ కొన నోటో పెట్టుకుని బలంగా ఊదు.

ఢాం అని చప్పుడుతో డబ్బా మూత రెండు బారాల ఎత్తు పైకి ఎగురుతుంది! ఈ బాంబు ప్రమాదకర మైనది కాదు. కనుక భయపడ వలసిన పని లేదు. ఊదే టప్పుడు మొహం డబ్బా మీద పెట్టకపోతే చాలు. పైకి ఎగిరిన డబ్బా మూత నెత్తి మీద పడకుండా చూసుకో. (పడినా ఫరవాలేదు)

ఇంతకీ ఈ బాంబు ఎల్లా పేలిందో అర్థమైందా? మైదాపిండి మండి పేలుడికి కారణం అయిందంటే నమ్మబుద్ధి కాదు కాని జరిగినది అదే. అసలు మైదాపిండి మండుతుందా అని మీ సందేహం. కదూ! పిండి కుప్పగా పోసి, అగ్గిపుల్ల వెలిగించి, అందులో గుచ్చితే మంట ఆరిపోతుందని మనకి తెలుసు దానికి కారణం మంటకి అవసరమైన ఆక్సిజన్ దొరకక పోవడమే. నిప్పుల మీద మైదాపిండి కొద్దిగా చల్లితే బాగానే మండుతుంది. పిండి విడి విడి రేణువులుగా ఉంటే ఆక్సిజన్ పుష్కలంగా దొరికి అవి మండుతాయి. గొట్టంలోకి గాలి ఊదినప్పుడు గళ్లాలోని గోధుమపిండి సూక్ష్మమైన విడి విడి రేణువులుగా డబ్బాలోకి విరజిమ్మ బడుతుంది. ఆ రేణువులను మండించడానికి డబ్బాలోని ఆక్సిజన్, కొవ్వొత్తి మంటలోని వేడి చాలు ముందర కొవ్వొత్తి మంటకి దగ్గరలో ఉన్న రేణువులు మండుతాయి. ఆ వేడికి చుట్టుపక్కల రేణువులు మరికొన్ని మండుతాయి. ఈ విధంగా గొలుసు కట్టు లాగ లక్షల కొద్దీ రేణువులు అతిస్వల్ప వ్యవధిలో మండి




పోతాయి. అన్ని రేణువులు ఒక్కసారిగా మండడం వల్ల తయారైన కార్బన్ డైఆక్సైడు వాయువు వత్తిడి అధికమై, వ్యాకోచించి, డబ్బా మూతని పైకి గెంటేస్తుంది.

"అగ్గిమీద గుగ్గిలం" అనేది తెలుగులో చక్కని సామెత. గుగ్గిలం అనేది ఒక రకం చెట్టు నుంచి కారిన జిగురు. అగ్గిపుల్ల వెలిగించి గుగ్గిలం ముద్ద మీద పెడితే ఏమవుతుందో తెలుసా? భగ్గున మండి పోతుంది అనుకుంటున్నారా? ఓ పట్టాన మండదు. కొద్దిగా కరుగుతుంది. అంతే కాని, అదే గుగ్గిలం ముద్దని పొడిగ నూరి, చిటికెడు పొడి మంట మీద చల్లితే భగ్గుమని పెద్ద మంట వస్తుంది. ఏమిటీ తేడా? గుగ్గిలం ముద్దలా ఉన్నప్పుడు పైపై రేణువులకి తప్ప లోపలి రేణువులకి ఆక్సిజన్ దొరకకపోవడం చేత మండదు. దానినే పొడి చేసి చల్లినప్పుడు ప్రతి రేణువుకీ ప్రతి రేణువుకు కావలసినంత ఆక్సిజన్ దొరికి పెద్ద మంట వస్తుంది.

అలాగే మామూలు బొగ్గు ముక్కని కొవ్వొత్తి మీద పెట్టి వెలిగించబోతే ఓ పట్టాన మండదు. అదే బొగ్గుని మెత్తగా నూరి, వస్త్రగాళితం చేసి, చిటికెడు పొడి చల్లితే మంట వస్తుంది.

దీనిని బట్టి మంటకి ప్రాణం ఆక్సిజన్ అని తెలుస్తోంది కదూ? అన్నట్టు ఆక్సిజన్‌ని ప్రాణవాయువు అనే అంటారు కదా!

# వారఫలం

మహేష్

8-9-1978 శుక్రవారం మొదలు
14-9-1978 గురువారం వరకు

**మేషం** :— సాహసిక వ్యవహారాల్లో నష్టం వస్తుంది. అరధోళన కలుగుతుంది. వారంమధ్యలో వృత్తిలో ఆదాయం బాగుంటుంది. విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. ప్రముఖసంగిల సంభాషణలను జరుపగలరు. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది దైవకార్యాలు నెరవేరతాయి.

**వృషభం** :— రావలసిన డబ్బు అందుతుంది. పోటీవారిలో గౌరవం బాగుంటుంది. వారం మధ్యలో చికాకులు యేర్పడతాయి. మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. వారం ఆఖరులో అన్నివ్యవహారాలు తిరిగిబాగుంటాయి. స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మిథునం** :— రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. వృత్తిలో పోటీవారి పోటీ పెరుగుతుంది. మీ ఆలోచనలు ఫలిస్తాయి. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. వారంఆఖరులో శ్రమ కలుగుతుంది. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. దైవ కార్యాలు నెరవేరతాయి.

**కర్కాటకం** :— వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. ప్రయాణాలు బాగుంటాయి. మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. అనవసరమైన సందేహాలు కలుగుతాయి. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. ఆడంబరం కోసం వ్యయం జరుగుతుంది.

**సింహం** :— ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. ఉద్యోగంలో గౌరవంలభిస్తుంది. వృత్తిలో ఆదాయం బాగుంటుంది. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. ఇతరుల నిమిత్తం మీరు శ్రమ పొందవలసి వస్తుంది. స్త్రీలకు—బంధుమిత్రులను కల్సుకొంటారు. సంతానానికి సౌఖ్యవంతోషాలు లభిస్తాయి.

**కన్య** :— మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. మీ హుందాతనమే మీకు ఇబ్బందిని కలిగిస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. విద్యావైజ్ఞానికరంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**తుల** :— ప్రయాణాలు ఫలిస్తాయి. ఆర్థిక

# పుడుతూనే తెలివి మీరుతున్న పిల్లలు !

పిల్లలు, పిల్లల పెంపకం ప్రతి స్త్రీకి ఒక బాధ్యత. బాధ్యతలతో పాటు ఎదుర్కోవలసిన సమస్యలు కూడా కావలసినన్ని. భావి భారత పౌరుల్ని తీర్చిదిద్ద వలసిన తల్లిదండ్రులలో పసితనం నించీ ప్రతిదీ నేర్పుకోవలసిన బాధ్యత స్త్రీకే ఎక్కువ కనుక స్త్రీకున్న ప్రధాన సమస్యలలో ఈ పిల్లలే ప్రథమ స్థానం వహిస్తారు.

"సామాన్యంగా పిల్లలు అటు స్కూల్లో చేరీ చేరక వుండే వయసులో వాళ్లు చేసే అల్లరి భరించలేక నర్సరీలో చేర్పించే తల్లిదండ్రులు బోలెడు మంది. ఈ అల్లరి చేయడం పిల్లల జన్మహక్కుగా భావించినా, మనకి మాత్రం తలనొప్పిగా వుంటుంది. ముఖ్యంగా వెనకటి పిల్లలకంటే ఈకాలపు పిల్లలు పుడుతూనే తెలివిమీరి పోతున్నారు." అని ఇళ్లల్లో మనకంటే పెద్దవాళ్లంటే ముక్కున వేలేసుకుంటూ వుంటారు. ఆ మాట అక్షరాలా నిజం.

కాస్త తెలిసీ తెలియని వయసులోని పిల్లల మీద సినిమా ప్రభావం చాలా వుంటోంది. ఈ ఫైటింగ్ సీన్లు పిల్లల మీద విపరీతమైన రియాక్షన్ కలిగిస్తుంటాయి. అవే ఇంట్లో పిల్లలు ప్రారంభిస్తుంటే బాబోయ్ అనిపించక మానదు.

మన ఇంట్లో పిల్లలు తన్నుకున్నా ఒక విధంగా ఇబ్బంది లేదు అదే పొరుగు పిల్లలతో ప్రారంభిస్తే ఆ తగూలు తీర్చలేక చావాలి.



జొన్నలగడ్డ లలితాదేవి

మా పొరుగున ఒకావిడ వుంది. ఆవిడ పిల్లల్ని చూస్తుంటే నాకుమాత్రం అలాంటి పిల్లలు జన్మ జన్మలకీ వద్దు బాబోయ్ అనిపిస్తుంది. వాళ్లు చేసే వెధవ పన్లకి అంతూ పొంతూ వుండదు సరిగదా భరించ లేక మీ పిల్లల్ని కాస్త మందలించండి అని ఎవరైనా అంటే వాళ్లమ్మ వెంటనే "మా పిల్లలే కనిపించారా ?" అంటూ తాడెత్తున లేస్తుంది. ఇలాంటి తల్లి పెంపకంలో పిల్లలెప్పుడూ పైకి రారు. పిల్లలు తప్పలు చేస్తారు. అది వాళ్లకి తప్పని తెలియక కావచ్చు అలాంటప్పుడు మందలించితే దారిలో వుంటారు గాని సమర్థిస్తే చివరకు కన్నవారే బాధపడతారు. మొక్కై వంగనిది మానై వంగదని. ఇలాంటివన్నీ ఇంటి పట్టున వుండే తల్లి చూసుకోవాలి గాని పొద్దున వెళ్లి రాత్రికి వచ్చే తండ్రి చూడలేడు గదా !

"అతి సర్వత్ర వర్జయేత్" అన్నట్లు అతి గారాబంగా చూసే ఆడవారి వల్ల, అతిగా కొట్టే ఆడవారి వల్ల పిల్లలు ఎందుకూ పనికి రారు చివరకి.

పిల్లలకి కుతూహలం చాలా ఎక్కువ. "దేవుడు కనిపించి నీకేం కావాలి ? అని ప్రశ్నిస్తే పిల్లలకి కుతూహలం ప్రసాదించు అని కోరుకుంటాను." అన్నది ఎలినార్ రూజ్‌వెల్ట్.

ఈ పిల్లలు వేసే ప్రశ్నలకి అర్థం వుండదు. సరిగ్గా మంచి టైములో ఏ కూర తిరగమోత అప్పుడో, మూడ్‌లో పడి రాసుకుంటున్నప్పుడో పరిగెత్తుకుంటూ వచ్చి ఏవో ప్రశ్నలు కుప్పిస్తుంటాడు మా బాబు అలాంటప్పుడు మనకి సాధారణంగా ఓర్పుండదు. కసిరి పంపేస్తుంటాము. ఆ తర్వాతైనా వాళ్లడిగిన దాన్ని గుర్తు పెట్టుకొని చెప్పడం వల్ల వారిలో సందేహాలు తొలగి, ఉత్సాహం, సంతృప్తి కలుగుతాయి.

ఏది ఏమైనా పిల్లల పెంపకం ఆడవాళ్లకి ఒక పెద్ద స్టడీ అంతేగాక కేవలం ఆడవారే పిల్లల బాధ్యత వహించడం మరింత ఘోరానా. పురుషులు కూడా బాధ్యత వహించాలి... అది మంచిది

---

వ్యవహారాలు బాగుంటాయి మిత్రులకు సహాయం చేస్తారు. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. వారం ఆఖరులో అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది. స్త్రీలకు కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

వృశ్చికం :— వృత్తిలో ఆదాయం బాగుంటుంది. తోటివారిలో గౌరవం లభిస్తుంది. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. రావలసిన డబ్బు అందుతుంది. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు ఆరోగ్యం బాగుంటుంది. సాహిత్యకళా రంగాల్లో మీకృషి రాణిస్తుంది.

ధనుస్సు:— వ్యతిరేకమైన వార్తలను వింటారు. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. వారం మధ్యలో అన్ని వ్యవహారాలు బాగుంటాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు లాభించగలవు. స్త్రీలకు కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అధిక వ్యయం జరుగుతుంది.

మకరం:— నూతన వ్యవహారాలు బాగుంటాయి. రావలసిన డబ్బు అందుతుంది. వారం మధ్యలో చికాకులు యేర్పడతాయి. మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాలు అనుకూలంగా ఉంటాయి. స్త్రీలకు ఆరోగ్యం బాగుండదు. వినోద కాలక్షేపాలలో పాల్గొంటారు.

కుంభం:— అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. వృత్తిలో ఆదాయం పెరుగుతుంది. మిత్రుల సహాయం లభిస్తుంది. వారం ఆఖరులో ఫలితం లేని శ్రమ కలుగుతుంది. స్త్రీలకు దైవ కార్యాలు నెరవేరతాయి. బంధువులకు చికాకులు యేర్పడతాయి.

మీనం:— సంతోషకరమైన వార్తలను వింటారు. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి. సాహసిక వ్యవహారాలు లాభించగలవు. స్త్రీలకు బంధుమిత్రులను కలుసుకొంటారు. విలాస వస్తువులు కొంటారు.

# డాక్టర్ సలహాలు

**వి. వీ. కె — చిత్తూరు**

మా పాపకి 3 సంవత్సరములు. అప్పుడప్పుడు దొంగతనంగా మట్టి తింటుంది. అన్నం సరిగ్గా తినదు.

అలవాట్లలో మార్పు ఇలాంటివారికిఅవసరం ఏదో వ్యాపకం కల్పించటం ద్వారా, ఇలా చేసే అలవాటును వారికి తెలియకుండా మాన్పవచ్చును

మల పరీక్ష చేయించి అందులో క్రిములు ఉన్నప్పుడు, ఆ క్రిములకు తగిన మందులు వాడితే ఆకలవుతుంది ఆకలి బాగా ఉన్నప్పుడు కడుపునిండా అన్నం పెడితే ఇక మట్టి తినాలనే ఆలోచన రాదు.

ఈ మట్టి తినటాన్ని 'పైకా' అంటారు. 'నియోఫెరం' రోజుకి 2 స్పూనులు వాడండి.

**పి. ఎస్ — పెరంబూర్**

నా వయస్సు 18 సంవత్సరములు. అప్పుడప్పుడు నడుస్తున్నప్పుడు అరికాలు మధ్యలో చర్మం పట్టి లాగినట్లు ఉంటుంది ఈ మధ్య కుట్టుమిషన్ తొక్కిన తర్వాత కూడా ఆ భాగంలో నొప్పి ఉంటున్నది.

అరికాళ్ళల్లో చర్మం క్రింద గట్టి పొర ఒకటి మడమ దగ్గర నుంచి వేళ్ళదాకా వెడుతుంది. ఈ పొర కొంచెం చిన్నదయినపుడు ఇలా నొప్పి రావచ్చు. కొందరికి చర్మం లోపలి భాగంలో చీము పట్టటం ద్వారా కూడా ఈనొప్పి ఉంటుంది.

'సల్ఫాడిమిడీన్' రోజుకి 6 మాత్రల వంతున ఒక వారంరోజులు, 'సిట్రావైట్' రోజుకి 3 వంతున 10 రోజులపాటు వాడి చూడండి. మందులు కాకుండా తరచు పాదమును పైకి, క్రిందికివంచటం వేళ్ళనిపైకి క్రిందికిఆడించటం మొదలైన వ్యాయామములు చేస్తే తొందరగా తగ్గుతుంది.

**ఎస్. వి. బి. — హైదరాబాద్**

సంవత్సరం క్రితం కందిపప్పు వండిన దానితో మామిడి పచ్చడి కలిపి తిన్నాను, ఆ రోజు రాత్రి చాలా విరోచనాలు అయ్యాయి. ఆ రోజు మొదలు ఇప్పటివరకు మధ్య, మధ్య ఎప్పుడైనా కందిపప్పు తింటే విరోచనాలు అవుతున్నాయి. అందువల్ల కందిపప్పు తినటం మానేసినాను, అంతకు మునుపు మామూలుగా కందిపప్పు తినేవాడిని మరి సంవత్సరమునుండి పడక పోవుటం ఎందువలన?

కందిపప్పు—మామిడి పచ్చడి కలసి మీ ప్రేవులలో కొన్ని మార్పులను కలిగించి ఉంటాయి. ఈ మార్పువల్ల—ప్రేవులలో ఒక అలర్జీ వంటిది ఏర్పడి ఉంటుంది. ఈ అలర్జీ కారణంగా కందిపప్పు తినటంవల్ల-ప్రేవులకి ప్రవిసర్జన అలవాటయి ఉంటుంది. ఈ అలర్జీ నేసమధ్యలో ఏ సమయంలోనైనా రావచ్చును: శరీరంలో మార్పురాక పూర్వం మామూలుగానే ఉంటుంది. మీకు ఒక సం॥ క్రితమే శరీర తత్వంలో అలర్జీ కారణంగా మార్పురావటం వల్ల అప్పటినుంచీ ఇలాజరగటం ప్రారంభించింది.

**వి. ఆర్. — బెంగుళూరు**

కాళ్ళుమడిచి కూర్చొని లేచినపుడు, కలుక్కు-మనే శబ్దం వస్తుంది. ఎందువల్ల?

ఇలా శబ్దం సాధారణంగా వయసు మీరిన వారిలో వస్తుంది ఎముకలు వయస్సు మీరినకొద్దీ అరిగి, రాపిడి చెందటంవల్ల ఇలా జరుగుతుంది. కొందరికి ఇలా చిన్నవయస్సులోనే జరుగవచ్చు. ఎముకల కొనలు అంటే కాళ్లవద్ద సరిగ్గా ఏర్పడనప్పుడు ఒక ఎముకకు, ఇంకొక దానికి, సరి అయిన అమరిక లేనప్పుడు ఇలా జరుగుతుంది.

వయస్సు మీరిన వారిలో ఈ లక్షణాలు వున్నవారికి 'అస్టియో ఆర్థ్రైటిస్' వుంటుంది. అట్టివారికి 'ప్రెడ్నిసొలోన్' 'ఫినైల్ బ్యుటాజోన్' మాత్రలు వైద్యుల సలహాపై వాడండి

—డా. కె. వెంకటేశ్వరరావు

# హైదరాబాద్ నోట్‌బుక్

తిరుమల రామచంద్ర

**రాంగ్ నంబర్!**

పెద్ద పెద్ద హోటళ్ళలోను, సత్రాలలోను గదులు దాదాపు ఒకే రకంగా వుండడంవల్ల ఒకగదిఅనుకొని మరొకగదితలుపులు తట్టడం, తలుపు తెరిచిన వ్యక్తిని చూచి గతుక్కుమనడం ప్రతివారికిఅనుభవంలోదే. కాని ఇదికద్యాచిత్కంగా జరిగే విషయం. కాని రోజూ కొన్నిటెలిఫోను రాంగ్ నంబర్లు వినిపిస్తేనో, మనం డయల్ చేసినప్పుడు వస్తేనో ఎలా వుంటుంది? మనస్సు చిరచిర్లాడుతుంది టెలిఫోన్ రిసీవర్‌ను విసిరి పారేద్దామనిపిస్తుంది కడుపు చించుకొంటే కాళ్ళ మీద పడుతుందన్నట్టు విసిరివేస్తే నష్టం మనకే గదా అని మనస్సు కుదుటపెట్టుకోవలసి వస్తుంది నేనున్న ఇంటిలో నా మిత్రుడు శ్రీ లక్ష్మణశాస్త్రి టెలిఫోను నంబరు 33782. కాని రోజూ కనీసం పదిసార్లయినా 33882 కదూ, 33772 కదూ, 33872 కదూ అని పిలుపులు వస్తుంటాయి పాపం! పిలిచేవారు చాల ఆత్రంలో వుంటారు. హలో రోశయ్యను పిలు నాజర్ లేడూ? సీతారాం గారేనా మాట్లాడుతూంట? సైకిల్ షాపునుంచి మాట్లాడుతున్నాను రిబ్బన్ పడిపోయిందండి ఇలామనం మాట్లాడకముందే. రిసీవర్ ఎత్తీఎత్తగానే కైలాసనాథకోన సెలయేరు లాగ కుమ్మరిస్తారు. ఒక నిమిషంవరకు మనం చెప్పేదేమి వినకుండనే. మనం రాంగ్ నంబరండీ, మీకు ఏ నంబర్ కావాలో సరిగా డయల్ చేయండి-అంటూ మనకోండి వినిపించుకోరు. హలో అంటాడు రెండో నిమిషానికిగాని మనం చెప్పేది చెవిని వేసుకోడు. నంబర్ డయల్ చేసే పద్ధతి సరిగా వుండాలని, నిజంగా రాంగ్‌కాల్స్ వస్తాయంటే 50 శాతం రిబేట్ ఇస్తున్నామని. రాంగ్ కాల్స్ సంభవిస్తాయనే దృష్టితోనే ఒక్కొక్క లైనుకు 260 కాల్సు ఉచితంగా ఇస్తున్నామని అధికారులంటారు. కాని బాధపడేవారికి ఈ సంజాయిషీలు అర్థంకావు కాకపోగా మనం అర్జెంటుగా ఎక్కడికైనా ఫోనుచేస్తే, ఆ నంబరు రాకపోగా "కోడై" అని ఏదంటూ వనితో సమాధానమిస్తే, కోపంలేదు త్రిభుజంలేదు ఫోను విసిరి పారేయబుద్ధి పుట్టడం సహజం.

**శ్రీ పంచనాదం సన్మానం:—**

స్వయం కృషితో సంగీతనాట్యాలునేర్చుకొని మాధవపెద్ది, బళ్ళారి రాఘవ కపిలవాయి రామనాథశాస్త్రి మున్నగు ప్రముఖ నటులతో వివిధ పాత్రలు నిర్వహించి సురభి కంపెనీలో ఎంతో కాలం పనిచేసి, దాదాపు 75 నాటకాలు రచించి, కొన్నివేలమంది శిష్యులను నటులను తయారు చేసిన కళావిశారద శ్రీ మదిర పంచనాదంను జులై 29న దాదాపు 50సంస్థలు రవీంద్రభారతిలో సన్మానించాయి. సన్మానసంఘానికి ప్రముఖ న్యాయవాది, నటుడు శ్రీ కోకా రాఘవరావు అధ్యక్షులు శ్రీఆర్ సి వి రెడ్డి కార్యదర్శి. సన్మాన సభకు రాష్ట్ర హైకోర్టు న్యాయమూర్తి శ్రీమతి కె అమరేశ్వరి అధ్యక్షత వహించారు. రాష్ట్ర ప్రధాన కార్యదర్శి శ్రీ బి జె నాయుడు ముఖ్యాతిథిగా వున్నారు

విజ్ఞాన కళాకేంద్రం ప్రధాన కార్యదర్శి శ్రీ ఎం. ఎ. సుబ్బారావు పంచనాద నటనవిశేషాలను, శిష్యవాత్సల్యాన్ని ప్రశంసించారు దాదాపు 30 సంస్థలు శ్రీ పంచనాదాన్ని పూలమాలలతో అలంకరించి, వస్త్రాలు మున్నగునవి బహూకరించాయి. శ్రీ పంచనాదం సింహాసనం వేయిస్తూ, విఖ్యాత నటులతో తాము నటించామని, శ్రీ స్థానంవారితో సారంగధర వేశామని, చెబుతూ ఆరోజుల్లో నటనను ఎలా తపస్సుగా ఆరాధించిందీ వివరించి, కృతజ్ఞత తెలిపారు కళాభిమానులు చూపిన ఆదరంతో ద్విగుణీకృతోత్సాహంతో కృషిచేస్తామని అన్నారు శ్రీ పంచనాదం గౌరవార్థం శ్రీ కోకా రాఘవరావు బృందం శ్రీకృష్ణతులాభారం నాటకం ప్రదర్శించింది శ్రీ రాఘవరావు కృష్ణుడు, నిమ్మగడ్డ నాగేశ్వరరావు వసంతకుడు, శ్రీ నాగభూషణం నారదుడు, శ్రీ వాసుదేవరావు గణ్యుడు, శ్రీమతి పి. రాజేశ్వరి సత్యభామ, శ్రీమతి పి. పార్వతి రుక్మిణి, కుమారి కమల నళిని పద్యానికి ఎక్కువరాగం పెట్టక, తగుస్వరంతో రాగచాయలో చదివే పద్ధతిలో శ్రీ రాఘవరావు చక్కగా నటించారు కృష్ణుడు చిన్నకాటి చిలిపి పిల్లవాడు కాదు ఎనిమిదిమంది భార్యలతో కాపురం చేస్తున్న గృహస్థు. ఉదాత్తత అవసరం ఆ ఉదాత్తగంభీరత శ్రీ రాఘవరావు నటనలో ప్రస్ఫుటమయింది శ్రీమతి రాజేశ్వరి సత్యభామ పాత్రను చక్కగా నిర్వహించారు తక్కిన వారు తమతమ పాత్రలను బాగా పోషించారు. నాటకమనేది సమిష్టి కృషి. ఒకరు తప్పటడుగు వేసినా అభాసపాలయినట్టే ఈబృందంప్రదర్శనలో సమిష్టి కృషి స్పష్టంగా కనిపించింది మనకు ఉన్నతోద్యమాల్లో సరైన రంగస్థలం లేకపోవడం. నటనసహజగుణమును, విదేశాలలోవున్నట్టు రోజూ నాటకం ప్రదర్శించగల రంగస్థలం వుండాలని తరచు చెప్పే డాక్టర్ చెన్నారెడ్డి ముఖ్యమంత్రి అయ్యారు గనుక, ఆయన పరిపాలనకాలంలో రాజధానిలోనేగాక, ప్రతిజిల్లా కేంద్రంలోను ఉత్తమ ఆధునిక రంగస్థలాలు నెలకొంటాయని ఆశిస్తున్నాను

**శ్రీ శివరామ కారంత్‌కు జ్ఞానపీఠ అవార్డు**

ప్రముఖ కన్నడ రచయిత శ్రీ శివరామ కారంతుకు జ్ఞానపీఠ్ అవార్డు లభించినందుకు ఇక్కడి కన్నడులు చాల సంతోషించారు శివరామ కారంత్ స్వాతంత్ర్య యోధుడు రచయిత, కవి, నాటక కర్త, నవల కర్త మాత్రమేకాదు. భారతదేశంలోని ఏ రచయితకూ లేని విచిత్ర వ్యక్తిత్వం ఉంది ఆయనకు ఆయన పిల్లలకోసం విజ్ఞాన సర్వస్వం ఒంటి చేతిమీద రచించారు. పిల్లలకోసం ఒకమ్యూజియం, ఒకజంతుప్రదర్శనశాల నెలకొల్పారు పిల్లలకోసం విడిగా పెక్కు వైజ్ఞానిక పుస్తకాలు వ్రాశారు పెక్కు సాహిత్య బాల పత్రికలు నిర్వహించారు. ప్రస్తుతం అవార్డు వచ్చిన నవల మూకజ్జియ కనసుగళు (మూగ అవ్వ కలలు) కన్నడానికి కారంత్‌తో సహా ముగ్గురికి జ్ఞానపీఠ అవార్డు వచ్చింది కారంత్ పుస్తకాలు దేశంలోని అన్ని భాషలలోకి, విదేశ భాషలలోకి పరివర్తన మయ్యాయి మరళి మణ్ణిగె అనే గొప్ప నవలను నేను మరల సేద్యానికి, మరణానంతరం అనితెలుగు చేశాను



గూడూరు శ్రీ కాళిదాస్ కళా నికేతన్ 19వ వార్షికోత్సవంలో "జయచిత్ర"కు "కళాజ్యోతి" బిరుదు ప్రదానం. శ్రీనివాస్, పి.ఎ. కృష్ణయ్య, జయచిత్ర, గౌస్ భాషాలను బొమ్మలో చూడవచ్చును

# నాడు - నేడు - రేపు

— చైతన్యమ్.

కులమత వైషమ్యాలు పెచ్చు పెరిగి ప్రజలలో అనైక్యత ప్రబలిన రోజుల్లో సమైక్యతా భావమేగాక అచలనిర్గుణ తత్వాన్ని తత్వరూపంలో ప్రభోదించి ప్రజలను ప్రభావితం గావించిన మహాయోగి శ్రీ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి

బ్రహ్మంగారి వేదాంత భావగర్భితమైన కాలజ్ఞాన తత్వాలు విననివారుగాని, తెలియనివారుగాని ఆంధ్రుల్లో లేరనే చెప్పాలి.

"నాల్గువేల యునమన్నూట ముప్పది యేండ్లు (1728) కలియుగాబ్దములు జరిగేనుమా! కలియందు శ్వేతముఖులు దొరలయ్యేరు మెలకువతో రాజ్యమేలేరు"

"శ్వేతముఖులు ధూమ శకటముల్ గల్పించి భూతలమున నినుప కమ్మిల పైన్ మాత్రమెరిగిన పశ్చిమోత్తర దిశలందు ఫూత్రముగా నడిపించేరుమా"

"హరి లోహత్రమదారు శకటముల పైని అన్నిజాతులు ఒక్కటై అందులోను స్వకులాచారముల్ దప్పి వకరిపైన ఒకరు పైబడి వూళ్ళకురికేరుమా."

"ఉత్తరదేశమున వైశ్య కులమందు ఉత్తమ 'గంధి' యొకడు బుట్టినిమా హత్తుగ వన్నియూ దేశముల వారంత సత్తుగ పూజలు చేసేరుమా" "ప్రభవ పార్థివ మధ్య పరదేశములన్ని బహుప్రళయముల చేతనిండీనిమా—" అంటూ రెండవ ప్రపంచయుద్ధం జరుగుతుందని కాలజ్ఞానంలో వివరించారు. రాజులు తమతమ రాజధర్మంబులు విడిచి నీచవుద్యోగులై నీచకార్యంబులకు జొచ్చి స్వకార్యంబులు లేక వెతావెతలై దేశానికి ఒక్కడై పోవును.

విధవ స్త్రీ పాలనలో రాజ్యపు స్థితిగతులన్ని తారుమారగును. బ్రాహ్మణులు నీచులనాశ్రయించి షట్కర్మరహితులై చెడిపోదురు.

అస్పృశ్యతా భావమడుగంటి పోవును. మాల మాదిగలు వేదాలు వేర్చెదరు. విధవా వివాహములు అధికముగా జరుగును.

పంది కడుపున ఏనుగు పుట్టును. అయిదు కాళ్ళను, రెండు యోనులుగల దూడను ఆవు ఈనును అందొకటి మానవ స్త్రీయోనియు, మరియొకటి గోయోనియు లయి వుండును ఐదుతలలుగల మేకపోతును మేక ప్రసవించును కప్ప కోడివలె కూత కూయును. ఒక చెట్టొకటి పగలు వంగును రాత్రులు లేచుచుండును దీనిని దేవతా వృక్షమని నమ్మి ప్రజలు మొక్కి భక్తితో పూజింతురు తిరుపతి వెంకటేశ్వరుని మహిమ అధికమౌను.

పురుషులతోపాటు సమానముగా అన్ని హక్కులూ కోరుతూ స్త్రీలు పోరాడెదరు. తలవెంట్రుకలు, గడ్డములు పెంచిన యువకులు, స్త్రీపురుషభేదము తెలియని వస్త్రధారణతో యువతులు అన్ని చోట్లా కనపింతురు దూరశ్రవణములు దూరదృష్టులు ప్రతివారికీ అందుబాటులో వుండను.

కాలజ్ఞాన గ్రంథంలో తెలియజేసిన పై సంఘటనలు ప్రస్తుత కాలంలో కొన్ని జరిగాయి మరికొన్ని జరుగుతున్నాయి.

ఇక శ్రీ స్వామివారి అవతారతత్వం, జీవిత విశేషాలను గురించి వివరిస్తాను

హిందూదేశ రాజులు అంతఃకలహాలతో యుద్ధాలు సాగిస్తున్న కాలంలో, ఇస్లాంమత వ్యాప్తికై

ధర్మానికి, స్త్రీకి, పసివారికి గోమాతకు రక్షణవుండదో అప్పుడు అక్కడ తనను తానే సృష్టించుకుని ధర్మస్థాపన చేయునని భగవద్గీతలో చెప్పినప్రకారము శ్రీమన్నారాయణుడు ప్రకృతాంబ పరిపూర్ణయాచార్య పుణ్యదంపతులకు జన్మించినాడు.

బిడ్డ పుట్టిన వెంటనే భర్త మరణించుటచే ప్రకృతాంబ, పసిబాలుడుగ వున్న వీరనారాయణుని అత్రిమునికిప్పగించి భర్త ననుసరించింది.

బిడ్డలులేని వీరపాపమ్మ భగవత్ప్రేరితయై భర్తతో కలిసి పుణ్యక్షేత్రాలను దర్శిస్తూ అత్రిముని ఆశ్రమాన్ని చేరుకున్నారు పూపొద సమీపాన ఒక లెన్నెపై నాగరాజ పడగనీడలో చిరునవ్వులు చిందిస్తున్న వీర

నారాయణుని చూడగనే వీరపాపమ్మకు పుత్రప్రేమ పొంగిపొరలింది. ఆ బాలుడ్ని అత్రిముని చేతులమీదుగా దత్తునిగా స్వీకరించి స్వస్థానమైన కన్నడ రాజ్యములోని పాపాఘ్ని మఠమునకు, పాపమ్మ దంపతులు పరమానందముతో తీసుకుపోయి వీరంభట్టని నామకరణం చేసారు.

లయకారకుడైన శంకరుడు కాశీరాజ దంపతులకు ఆనందభైరవునిగా జన్మించి సప్తవ్యసనములలో ఒకటైన వేట వ్యామోహములో పడి పులియని భ్రమపడి గోవును చంపి, ఆ మహాపాతక నివృత్తి మార్గము నుపదేశించగల మహానుభావుని గూర్చి వెదకుచు హరిహరిపురం (విష్ణు కంచి, శివకంచి) నందున్న వీరంభట్టును దర్శించాడు.

గోహత్యాపాతక నివృత్తి నెపంబున దూదేకు సాహెబు దంపతులకు కుమారుడవై పుట్టి, అప్పుడు వీరబ్రహ్మ నామముతో నున్న నాకు శిష్యుడవై, సిద్ధుడవై మత సమైక్యత కొరకు పాటు పడమని వివరించి వీరంభట్టు వీరప్పయ్య పేరుతో బనగానపల్లెలోని గరిమిరెడ్డి అచ్చమ్మ గారింట గోపాలునిగా చేరి పడమటి కొండలలో గిరిగీసి గీతలో గోమందను నిల్పి, తన మహిమ వలన నేలకు వంగిన తాటిచెట్టు నుండి మొవ్వను, వక్కనేపుష్ప గులజారి ముళ్లను తీసుకుని సమీప గుహలోనికి పోయి కాలజ్ఞాన గ్రంథాన్ని వ్రాయడం మొదలెట్టారు.

వీరప్పయ్య మహిమలు క్రమంగా బనగానపల్లె ప్రజల ద్వారా అచ్చమ్మ దంపతులు వినినవారై ఒకనాడు ఆలమందను తోలుకు వెళుతున్న వీరప్పయ్య వెంట వెళ్లి అసలు రూపు తెలుసుకున్నవారై స్వామిని గురువుగా స్వీకరించి లోమఠాన్ని కట్టించి యిచ్చారు. గుడ్డివాడైన అచ్చమ్మ కుమారునికి దృష్టిని ప్రసాదించి, విషయలోలుడైన బనగానపల్లె నవాబుకు "మతాలెన్ని వున్నా అవన్నీ ఒకడైన భగవంతుని చేరుటకై మార్గాలేన"ని బోధించి తన మహిమ చూపి జ్ఞానోదయం కలిగించి, బ్రహ్మదేవుని అవతారుడైన అన్నాజయ్యను లో మఠాధిపతిగా నియమించి దేశ సంచారము గావిస్తూ వీరప్పయ్య వీరబ్రహ్మమను పేరుతో కందిమల్లయపల్లె చేరుకున్నారు

అక్కడ కాల వృత్తియగు వడ్రంగము, కమ్మరము చేయుచు ప్రజలకు జ్ఞాన మార్గమును బోధించుచు, పోలేరమ్మచేత నిప్పును తెప్పించి జాతరుల పేరుతో జరుగుతున్న బలుల నాపు చేసినారు.

స్వామి పెద కామెర్ల గ్రామంలో చనిపోయిన పిచ్చిరెడ్డిని బ్రతికించారు. ఎరుకల సింగి వేషంలో శివకోటయ్య మనసు మార్చి అతని కుమార్తె గోవిందమ్మను వివాహమాడినారు.

ఆ దంపతులకు సిద్ధిలింగయ్య, గోవిందయ్య, శివరామయ్య, ఓంకారయ్య, పోతులూరయ్య అను కుమారులు వీరనారాయణమ్మ యను కుమార్తె జన్మించారు.

ఆనంద భైరవునిగా పుట్టి గోహత్య గావించిన శంకరుడు ఆదుంబి పీరు సాహెబు దంపతులకు 'సయ్యద్'గా పుట్టి పన్నెండవ యేటనే స్వామిని చేరి పాదసేవ చేయుచు ప్రియ శిష్యుడై సిద్ధుడయ్యాడు.

స్వామి శిష్య సమేతంగా దేశ సంచారము గావిస్తూ మరెన్నో మహిమలను కనబరచారు. గ్రామంలో దిగునప్పుడు ఒక కంసాలిని దాహము అడుగగా యిచ్చిన కరిగిపున్న లోహ ద్రవాన్ని తాగి మరికొంత యిమ్మన్న స్వామి మహిమ తెలుసుకున్న కంసాలి శిష్యులలో ఒకడయ్యాడు. పుట్టెడు బియ్యం అన్నాన్ని సిద్దయ్యచేత తినిపించి ధన గర్వంతో విర్రవీగుతున్న నంద్యాల గ్రామ పెద్దలకు జ్ఞానోదయం కలిగించారు. చూడి గుర్రం ప్రసవ మవ్వకముందే దాని పిల్లను చూడాలన్న కడప నవాబు కోరికను స్వామి తీర్చారు.

కుష్ఠు వ్యాధితో బాధపడుతున్న విద్యాసాగరుని పరిపూర్ణ ఆరోగ్య వంతునిగా చేసారు.

సిద్దయ్యకు సాంఖ్యయోగం వినిపిస్తుండగా చెట్టు చాటు నుండి విన్న మాదిగ కక్కయ్య దేవుళ్లను మాడపవ్యని భార్యను చంపుకోగా స్వామి ఆమెను బ్రతికించి షట్చక్రాలను విపులీకరించి, ఆ దంపతులను శిష్యులుగా చేర్చుకున్నారు.

అహోబిలంలో మర్రిచెట్టు నాశ్రయించి యున్న బ్రహ్మ రాక్షసికి జనన త్వము నొడిగిన కొండగాలునగా వారిద్దరు మిగిలిన కులాలవారిని హీనంగా చూస్తూ అగ్ర వర్ణులమనే గర్వంతో తమను అవమాన పరచ జూచిన పుష్పగిరి అగ్రహారీకుల అజ్ఞానాన్ని దగ్ధం చేసారు.

నవాబులు భక్తులు యిచ్చిన అపారమైన కానుకలను నిండియున్న మఠాన్ని దోచుకోవాలని వచ్చిన దొంగల ముఠాను గుడ్డివారిగా మార్చి వారిలో పరివర్తనను కలిగించి తిరిగి దృష్టిని ప్రసాదించారు.

వైశాఖ శుద్ధ సప్తమినాడు గోవిందయ్యను మఠాధిపతిగా చేసి, నవమి రోజున పూజ ముద్దర తానుమరణిస్తానని సిద్దయ్యను బనగానపల్లెకు పంపి దశమి భానువారం నాడు వీరబ్రహ్మేంద్ర యోగి జీవసమాధి అయ్యారు

సిద్దయ్య తిరిగి వచ్చి సమాధి కడకు పోయి భక్తితో ప్రార్థించి స్వామిని ప్రత్యక్షము గావించుకున్నారు. శిఖ ముద్రిక, యోగ దండము, పాదుకలు శిష్యుని కిచ్చి



## నాడు—నేడు—రేపు

సర్వ మానవ సమానత్వమునకై కృషిచేయుమని ఆదేశించి స్వామి తిరిగి సమాధిలో ప్రవేశించారు.

తల్లి గారింకను పసుపు కుంకుమలు విసర్జించక పుణ్య స్త్రీగా నుండుట చూస్తున్న పోతులూరయ్య తండ్రి బ్రతికున్నదీ లేనిదీ చూడవలెననే తలంపుతో ఒకనాటి రాత్రి సమాధిని బద్దలు కొట్టి యోగ నిద్రలోవున్న స్వామి యోగ భంగము గావించి వారి ఆగ్రహానికి గురియైయ్యాడు. తన వంశం నిర్వంశమై పోతుందని శపించారు. కుమార్తె వంశం వృద్ధి పొంది వారే మఠాధిపత్యం వహిస్తుంటారని చెప్పి అదృశ్య మయ్యారు.

జీవసమాధిలో స్వామి యిప్పటికీ సజీవులై వున్నారని భక్తులు నమ్ముతారు. ఇన్ని మహిమలు చూపి సర్వమానవ సమానత్వానికి కృషిచేసి సులభ భక్తి మార్గాన్ని ప్రచారం గావించిన శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామి 17వ శతాబ్దంవారని నిర్దుష్టంగా చెప్పవచ్చు.

వీరభోగవసంతరాయునిగా స్వామి అవతరించులోపల యీ భూమిపై యెన్నో అద్భుతాలు జరుగుతాయి.

కులమత ధనిక పేద వ్యత్యాసాలు లేక అందరొక్కటౌతారు. నదీనదాలు పొంగి విశేషప్రాణ నష్టాన్ని కలిగిస్తాయి. హంపి విరూపాక్షి రెండూళ్ళ నడుమ అగ్నివర్షాలు కురుస్తాయి. తిరుపతి వెంకటేశ్వరుని గుడిలోని గరుడధ్వజము నానాదిక్కులకూపోయి అద్భుతంగా ఆడుతుంది. అంబ యొకతె ఆరుసంవత్సరాలు యేకధాటిగా భూమిని పాలిస్తుంది. కృష్ణానదిలో బంగారు రథం కనుపిస్తుంది. దానిని చూచిన వారు దృష్టిని పోగొట్టుకుంటారు. పగలు నక్షత్రములగపడతాయి. అమావాస్యనాడు చంద్రుడుదయిస్తాడు. ప్రజలు ఆకురాలినట్లు రాలిపోతారు. భాను బింబము కంకణాకారముగ గోచరించి అందు విష్ణురూపము సాక్షాత్కరిస్తుంది. పాపులు అధికులౌతారు.

ఖడ్గము ధరించి అశ్వమునెక్కి వీరభోగ వసంతరాయుడు దుష్టులనందరిని హతమార్చి శిష్టుల రక్షించి యీ భువిపై ధర్మాన్ని స్థిరంగా స్థాపిస్తారు.

### ఒక పువ్వు

— సారథి

నీ తోటలో
నా పాట
ఒక పువ్వు
రంగుల రేకల్లో
సరిగమల సవ్వడి
పరువాల సొగసులో
సరాగాల పుప్పొడి
కాలకావ్యంలో
మకరంద అక్షరం—
ఆ పువ్వు
అదే— నీ తోటలో
నా పాటకు వికసించిన పువ్వు.

## ఉత్తరాలు

(7వ పేజీ తరువాయి)

11-8-78 నాటి మీ (మా) పత్రిక చాలా ఆకర్షణీయంగావుంది కార్టూన్లు కొద్దిగానే వున్నా చాలా బావున్నాయి. "మోహనరూపం" సీరియల్ మంచి సస్పెన్స్‌తో కూడి చాలా ఇంటరెస్టింగా సాగుతోంది. కథలు మూడేఐనా వేటికవే పోటీగా వున్నాయి. ఓ (నో) టు కథ, ఓ ప్రేమకథ మా హృదయాలను విశేషంగా ఆకట్టుకొన్నాయి.

ఏ. పి. ప్రభాకర్ (కర్నూలు-1)

* * *

జరీనా ముఖచిత్రం గల 28-7-78వ తేదీ పత్రికలో కథలు బాగున్నాయి. ముఖ్యంగా సెల్ఫ్ డిఫెన్స్ కథలో వేదాంతరావు కేరెక్టర్ కొత్త తరహాలో చిత్రించబడింది. పదిమందిలో తమ ఉనికిని తెలియ జేసుకునేందుకు, లాభం పొందేందుకు వేదాంతరావులాంటివాళ్ళు అలాంటి పనులు చేస్తూంటారు. "శ్రవ్యనాటిక" కూడా నూతనత్వం సంతరించుకుంది.

బానపల్లి ప్రశాంతబాబు. వైకుంఠం. రామారావు, రమణ. (విశాఖపట్నం-12)

* * *

నూతన నటి రజనీశర్మతో వెలువడిన (11-8-78) పత్రిక ముఖచిత్రము ఎరబాలేదనిపించింది. "ఓ ప్రేమ కథ" చాలా బాగుంది. "రాగద్వేషాలు" సీరియల్ ఇప్పుడిప్పుడే ఇంటరెస్టుకివస్తుంది. హైదరాబాద్ నోట్ బుక్ శీర్షిక పెద్ద ఇంటరెస్టుగాలేదు.

ఆర్. సుందరరావు. (బెంగుళూరు)

Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor. S. Radhakrishna